శ్రీరస్తు.

# కుశలవ

(ఆఱంకముల పౌరాణనాటకము)

గ్రంథకర్త:

శ్రీరామపట్టాభిషేకము, విజయభాస్కరము మొదలగు

నాటకములు రచియించిన

జమ్ములమడ్క లక్ష్మీనరసింహముగారిచే

రచియింపఁబడియె.

ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు

సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.



 1929 [వెల 1—0—0.

# ఈనాటకమునందువచ్చు పాత్రలు.



## పురుషులు.

శ్రీరాముడు—కథానాయకుఁడు.

లక్ష్మణుఁడు—
భరతుఁడు—
శత్రుఘ్నుఁడు—
} కథానాయకుని తమ్ములు.

సుమంత్రుఁడు—రథసారథి.

భద్రుఁడు—వార్తావహుఁడు.

వాల్మీకి.

వశిష్ఠుఁడు—పౌరోహితుఁడు.

కుశుఁడు—

లవుఁడు—

విమి—మునిబాలుఁడు.

## స్త్రీలు.

సీత—రాముని భార్య.

మల్లిక—
చతురిక—
} సీత చెలికత్తెలు.

ఇంకను సేవకులు మొదలగువారు వత్తురు.

పాత్రలు యిన్నియున్నను పదిమందితో ప్రదర్శింపవచ్చును.

శ్రీరస్తు.

# కుశలవ.



## నాంది.

ఉ. పామరు లాడుమాటలకుఁ బత్నిని గర్భిణినైనఁ బాసి, ధా
త్రీమహితాశ్వమేధమునఁ దేజిఁ దనూజులుగట్ట, ఘోరసం
గ్రామములోన నోడి, సుతులన్ సతినిన్ గ్రహియించినట్టి శ్రీ
రాముఁ డొసంగుఁ గావుత నిరంతర భద్రగణంబు మీ కిలన్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు—నటి ప్రవేశింతురు.]

సూత్ర—సుభగురాలా! నేఁడుఁగదా పర్వదినము మనకు!

నటి—ప్రియుఁడా! నేత్రానంద మొసంగు నీసభఁ గూర్చియే కదా!

సూత్ర—అగును. సభఁబట్టియే ప్రదర్శకుల కుత్సాహములు జనించును.

నటి—నాటకౌచిత్యముచేతకూడ ప్రేక్షకులమానసంబులు రంజిల్లఁ జేయవలయును.

సూత్ర—ప్రియురాలా! కరుణారసభరిత రూపక ప్రదర్శనమే కదా నేఁడు! యేలాటివారైన ననురక్తిఁగాంచకుందురే!

నటి—ఏమి నాటకమందురు?

సూత్ర—పౌరాణికము.

నటి—సరి సరి! ఆధునికలోకంబునకు బురాణవిషయకంబులు రుచియించునే?

సూత్ర—ప్రేయసీ! అట్లందువేమి? సమస్తహైన్యములఁ దొలఁగించి ఐహికాముష్మిక శ్రేయంబు లొనగూర్చెడు శ్రీరామచంద్ర కథన మెట్టివారికైన సొంపు నింపకుండునా?

నటి—సమర్థుఁడగు రచయితయు, సరసమగు కవితయు నైన సౌభాగ్య
మునగనే యుండును. పేరెయ్యది ?

సూత్రి—"శ్రీవిజయ కుశలవ"

నటి—ఓహో ! రాఘవునియుత్తరచారిత్రమేనా ! గ్రంథకర్త
నెఱుంగఁ జేయరేమి ?

సూత్రి—ఎఱుఁగవా ! లోకంబునకుఁ జిరకాల పరిచితుఁడే ! శ్రీమ
ద్రామాయణపూర్వోత్తరభాగంబుల రెంటిని, "శ్రీరామ
పట్టాభిషేకము" "శ్రీవిజయ కుశలవ" యనునామంబులతో
రూపకద్వయము నిర్మించి యుండెను.

నటి—ఓహో ! అట్లైన నెఱుంగుదును. కోరుకొండపవర్రి అగ్ర
హారనివాసులగు బాలకవి జమ్ములమడక లక్ష్మీనరసింహము
గారే కదా !

సూత్రి—అగు నగు ! బాగుగ గుర్తించితివి.

నటి—ఇయ్యది కృతి నెవరందిరి ?

సూత్రి—అన్యు లెవ్వరుగారు. అఖిలలోక త్రయాధారులైన శ్రీసీతా
రాములకే వారిది యంకితంబుఁ గూర్చిరి.

నటి—మంచిది. ఎట్టి ధన్యులములు !

సూత్రి—ఇంక నాలసింప నేమిటికి ? శ్రీరాముఁడు జానకీదేవితో
నుద్యానవనవిహారంబునకు బయలుదేరుదురు. మనము
వెళ్ళుదము.

నటి—వేగిరము రండు.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

తెరపడును.



శ్రీరస్తు.

# కుశలవ

## ప్రథమాంకము.



### రంగము.

ప్రదేశము:—ఉద్యానవనము.

[రాముఁడు, సీత, ప్రవేశింతురు.]

రాము—జానకీ! యీమాధవీలత యెంత మనోహరముగ నున్నదో కనుఁగొనుము.

సీత—నాథా! మాధవీలతలకేమి గాని యీపొన్నగున్న లతిసౌమ్యములుగదా!

రాము—(వేఱొకవైపుచూపుచు) వైదేహీ! ఇటు చూడుము.

ఉ. మావిచిగుళ్ళు మెక్కుచు, సమందగతిం బ్రియురాలిఁ జేరి "ల
జ్జావతి వేలవైతి?" వని చక్కఁగఁ బల్కుచు, కంఠమెత్తి యా
హా! వినవే లతాంగి! వినవయ్యెడుఁ గోకిలపాటఁ బాడెడుఁగా
భావజకేళిఁ గోరి యట పాదపశాఖలమధ్యసీమలఁగా.

సీత—మనోహరా! మున్నుచిత్రకూటమందలి నివాసముతో నీకోయిలలపాటలకు నాకర్ణములు తనివిజెందియున్నవి. మఱల నిప్పుడేల యట్టి యాసక్తిఁ గొలుపుదురు?—ఈపారిజాతములను కంటిరా? ఎట్టి సౌరభముల నీనుచున్నవో?

రాము—మైథిలీ! పారిజాతములకన్న నీ చాంపేయము లత్యంతరమణీయములైనవి గాదా?

సీత—నాథా! దేని పారభ్యము దానికే కలదు.

రాము—సీతా! కోమలుల సౌందర్యము. కుసుమముల పారభ్యము లనుపమానములందురు కదా! అవిగో యాప్రసూనములఁ బరికింపుము.

తే. గీ సిగ్గువడునేమి నీకునాసికనుఁ గాంచి
అబల! చాంపేయ మీాపు మాట్టంగవలదు.

ఓహో! తుమ్మెద లందు రొదలునల్పుచున్నవి సుమా!

వ్రాలునో యేమొ నీముఖపద్మమందు
కెరలి మకరందభ్రాంతి భృంగగణంబు?

సీత—నాథా! ఈయశోకవృక్షనీడ యత్యంతసంతాపహారణము. కొంతతడ విచ్చోటఁ గూర్చుండుదమా?

రాము—వైదేహీ! రావణుని యశోకవనములో శింశుపావృక్షనీడ యందే బహుకాలము గడపిన నీ వింకను నట్టిదానినే యాశించుచుంటి వెందులకు?

(అని యిరువురు కూర్చుందురు)

సీత—మనోహరా! ఇప్పుడు మనకాదుర్దినముల జ్ఞప్తియేల?. ఆచంచరీకద్వయమును గంటిరా?

రాము—ప్రేయసీ! చిత్రముగానే యున్నది.

ఉ. పంచశరాసనానల విభగ్నభయంబు వహించి మించి వ్రాలించును ఱెక్కలన్, ముదుచు నింకొకమాఱు చలించు, నంతఁగావించును పెన్రొదల్, గదియ నేఁగును ప్రేయసినొక్క తేఁటి, యోచంచలనేత్రి! దర్పకుఁడు సర్వ చరాచరముల్ జయింపఁడే?

సీత—ఆర్యా! మీా వాక్యము హృదయరంజకముగా నున్నది. అచ్చట నాచక్రవాకములజంటను కనుఁగొంటిరా?

చ. సతి యనురాగమూని సరసస్మితయై తమి భర్త చేరుటల్
కతి కరుణావిసన్నుఁడయి పత్నికిఁ దీర్చుట వాంఛితంబులున్
హితముగ రెంటియందు రచియించెఁ బరస్పర రాగసూత్రముల్
జతురతఁగల్గి ధాత, సువిచార్యము లన్నియు సృష్టిచిత్రముల్.

రాము—జానకీ! బాగుగాఁ బలికితివి కాని.

తే. గీ. ఉవిద! సందేహ మొక్కింత యొదవె నాకు
నీకు చద్వయికిని చక్రవాకజంట
సమమొ? కాదో? గ్రహించితే క్రమ మెలర్ప
బ్రహ్మనిర్మాణచయము చిత్రంబు కాదె?

సీత—నాథా! చక్రములనంటకుఁడు. అచ్చోట నామల్లియలసొంపు
బరికింపుఁడు. ఎంతహృద్యముగానున్నవి!

రాము—రమణీ! మల్లియలసొంపునకు రంజిల్లితివే?

తే. గీ. లలన! తెలుపవే, మల్లె మొగ్గలకు సతుల
ధవళతరమైన భవదీయ దంతతతికి
నీడయగు నేమొ? వేఁడెచ్చు వాడ నీకు
తగునొ ముదువంగ నీలకుంతలములందు?

సీత—మనోహరా! మీపరిహాసవాక్యములకేమి? చూచితిరా? ఆ
శిరీషపుష్పములు కడుంగడు ముచ్చటఁ గొల్పుచున్నవి!

రాము—దిరిసెనపూవులందువా దేవీ!

తే. గీ. మృదులమే గాని నవ్యశిరీషసుమము
షట్పదకదంబుఁ గొంతైన సైఁచఁగలదు
మృదుతరంబు నీమేను సైరింపఁగలదె
భ్రమరపదసూత్రమైన భారంబు నబల!

కాన నీవు వానినైన నాశింపుమేల? జానకీ! నీవు పెంచినవేకదా
తరుశాఖల నాశ్రయించుకొని, పరిమళప్రసూనభరితంబులైన

యాలతాసంతాన మెంతహృద్యముగనున్నది! నీవంటిసు
కుమారిచేఁ బెంపఁబడుట నవికూడ నత్యంతసౌకుమార్యతనే
వహించియున్నవి. అటుపీక్షింపుము.

సీత—నాథా! యీసమీపముననే యొక సరోవరమున్నదికదా?

రాము—దేవి! మెల్లన నచ్చటకు వెళ్ళుదమురమ్ము.

(అని యిరువురు నడచుచుందురు.)

సీత—మనోహరా! ఆశాఖాగ్రములందు చూడుఁడు.

చ. మధురములైన పండ్లఁగని । మాటికి మాటికి మెక్కుచుండియుఁ
బ్రిదిలినవాని జూడక న।వీనములంగని సంభ్రమంబులన్
వదలక ఱెక్కలార్చుచును । పల్కుచుఁ బాడుచుఁ లేచుచుండి,ప
ల్విధములనాటలాడుఁ గడు । ప్రేమవహించి శుకాళిఁగాంచుఁడీ!

రాము—సీతా! కీరములందైన నంతవిశేషము లేదు. ఏలనన ?

గీ. కాంత! నీపలుకుల కెన।గాకఁగాదె
మిక్కుటంబుగఁ బండ్లను । మెక్కిమెక్కి
సాటిగాఁజూచుచున్నవి । మాటలందు
కొంతవఱకైన చిలుకలు । కొదువకాదె?

సీత—ప్రాణేశ్వరా! ఆపున్నాగవృక్షము నాశ్రయించుకొనిన దొండ
పండ్లను పరికింపుఁడు. నోరూరజేయుచున్నవి.

రాము—బింబాధరా! ఇంతభ్రాంతిఁ జెందితివేల?

గీ. అబల! నీదైనయధరబిం।బంబుకంటె
రమ్యతర మానో? కడు మధు।రంబె యౌనో?
వనములందైన పండ్లకై । భ్రాంతియేల?
పృథివినూతనంబులె బహు । ప్రియములగును.

సీత—ప్రియా! దాక్షలవియే కాఁబోలు! ఎంతరమ్యములుగా
నున్నవి!

రాము—దేవీ! దాడిమ ఫలము లేల?

గీ. సఖియ! నీయధరోష్ఠర । సంబుకంటె
చాలమధురంబె యిందు దాడిమీరసంబు?
శ్లాఘ్యగుణములు నీయందు । సంభవించె;
తమ్ముఁ దాఁ గొనియాడుకోఁ । దగరుజనులు.

సీత—నాథా! సర్వజ్ఞులగుమీకు నాపై నింతటియనురాగముండుట చే కదా నాజన్మము ధన్యమైనది. ఇచ్చట నీకదళికాకాండముఁ బరికింపుఁడు? కనులపండువం గూర్చుచున్నది.

రాము—విదేహరాజపుత్రీ! ఈకదళీస్తంభములందైన నంతయధిక గుణ మేమియుఁ గానఁబడదు. ఏలయందువేని?

గీ. తరుణి! అతిమనోహరములై । తనరినట్టి
కదళికా స్తంభచయముబల్కంగనేల?
వర్ణనాతీతరుచిరమై । వరలుచున్న
మహిత భవదీయ యూరుయుగ్మంబు ముందు.

సీత—నాథా! యీసరోవరము ముచ్చటగా నున్నది. కొండొకకాల మీరమ్యప్రదేశమున విశ్రమింతము.

రాము—దేవీ! అటులనే. (అని యిరువురు కూర్చుందురు)

సీత—మనోహరా! సరోవరప్రాంతము లత్యంతసౌఖ్యసంతానవంతములుకదా!

రాము—దేవీ! బెదరిబెదరిపడుచు, బిత్తరిచూపులఁ బ్రసరింపఁజేయుచు కాసారజలంబులఁ గ్రోలుచున్న యీహరిణమును చూచితివే! నీచూపులకది సిగ్గుఁజెంది వెరువిడునేమోసుమీ!

సీత—హృదయేశ్వరా! హరిణమునుగూర్చియే మున్నాపద లందితిమి. ఇప్పుడు మఱల నా కట్టిదినములే జ్ఞప్తికి వచ్చుచున్నవి. హరిణప్రసంగములమాత్రము విడువుఁడు.

రాము—భీకహారిణేక్షణా! కలఁత నొందకుము. ఈసరోవరమందలి పద్మములఁగాంచితివే?

సీత—జీవితేశ్వరా! అపద్మములఁగూడ మీరే వర్ణింపుఁడు.

రాము—మైథిలీ! ఇంక నేమితెలుపుదును?

గీ. చెలువ! నీమోము నో నేత్రములను హస్త
ములనో; పాదంబులనో యేది పోల్పవచ్చు?
నతులస్వచ్ఛందనీరజవితతి కిపుడు
కలిగె సందేహ మొకయింత తొలఁగుటెట్లు?

సీత—ప్రాణేశ్వరా!

శా. మీసత్కీర్తులు ప్రేమహేతువులుస్వామీ! మీరువిశ్వాత్మకుల్
మీనయ్యంబులు సర్వలోకములు పాలింపంగ మీరే ప్రభుల్
జ్ఞానోదంచిత యింద్రియావహులు వి శ్వస్తుత్యచారిత్రులున్
మీనిత్యస్మరణంబు పాతకహరమ్మేసుమ్ము చిత్తేశ్వరా!

ఈవనవిహారము సలిపినప్పటినుండియు నాకొక యభిలాష జనియించినది.

రాము—దేవీ! ఎఱుఁగుదువుకదా అష్టావక్రమహామునీంద్రునిచే భగవతి యరుంధతీదేవియు, శాంతియుఁ బంపిన సందేశము!

సీత—సందేశమేమి?

రాము—"సీతకోరిక యెట్టిదైనను వేవిళ్ళగుటచేఁ దప్పకఁ దీర్చుచుండుమనికదా" ఋష్యశృంగాశ్రమమునుండి నిన్ననే వార్త నంపియుండిరి. అదియునుంగాక; గురువరేణ్యులగు వశిష్ఠభగవానులును, తల్లులగు కౌసల్యా కైకేయీ సుమిత్రలును నీయభీష్టములన్నియు నెఱవేర్చుచుండుటకు నన్నాజ్ఞాపించియుండిరి. కాన మనోహరీ! నీకిప్పుడు జనియించినవాంఛిత మెద్దియో తెలియఁజెప్పుము.

సీత—ఏమందురా? గంగాతీరమున్నాశ్రమభూములందు మునికన్య
కలతోఁ గొంతకాలముఁబుచ్చుఁ గుతూహలము కలిగినది.
రాము—దేవీ! యిది యెట్టికుతూహలము?
సీత—మనోహరా!

మ. ఘనులౌనిత్య తపోవిలాసులకు వేడ్కంబూజలంగూర్చుచున్
వినయస్నేహములంది యాశ్రమమృగానీకంబుతోఁ గోర్కెమై
దినముల్ బుచ్చుచు మానికన్యకలతో ద్వేషంబు లేకుంట శో
భనమే కాదె హృదీశ్వరా! కరుణఁదీర్పన్జూడుమీ కోర్కెనున్.

రాము—వైదేహీ! నీవుమ గ్ధవు. కాన యిట్టికోరికఁ గోరితివి. అబలవు, అతిభీతవు, అంతఃపురకాంతవు, నీవేమి? తపోభూములందు మునికన్యకలతోఁ గాలముఁ గడుపుటేమి? దేవీ! యిది యేమికోరిక?—

సీత—నాథా! నామనోభీష్టముఁ ద్రోసివేయకుఁడు. దీర్ఘతపోనియమములచే దివ్యతేజస్సంపన్నులై తెలియరానిపరబ్రహ్మంబు గుర్తించుచున్న సంయమీంద్రులయాశ్రమసీమలందు దుష్టజంతువర్గమైన నేమి పరస్పరస్నేహభావంబులతో మెలంగును కదా!

చ. హరులకు మత్తనాగములు హస్తముల న్వనమిచ్చునంట! ని
ర్భరకరుణావిలోకనపరంపరలం దగఁ గాంతుగంట యో
ల్లర మునిచంద్రులచ్చట మెలంగినవారికి పుణ్యమంట! యీ
శ్వర! మునికన్యలం దవిలి వర్తిలనీయవె కొన్నినాళ్ళటన్.

మ. అలరంబెంపును లేళ్ళఁజేర్చి యుపచారశ్రేణి నందించుచున్
లలితస్నేహముల న్వనీమృగములన్ లాలించుచున్ గూర్మితో
ఫలపుష్పాదులు మౌనిచంద్రుల సంభావించి యర్పించుచున్
వెలలన్ బుచ్చెదఁ గొంతకాలము మనఃప్రీతిం దపోభూములన్.

రాము — సాధ్వీ! తపోభూములందు నాఁడువారలు నివసించుట తగదు. ఆశ్రమభూము లనిపేరుమాత్రమే. కాని యవి యతి భీకరములు — అఖిల క్రూరజంతుసంతానమయములు — అతి దుష్టనిశాచరసమూహసంచారములు. సమస్తచరాచరభ్రాంతి విరహితులై — సర్వేశ్వరార్పితచిత్తప్రవృత్తులై తన్మయత్వమునఁగాలముగడుపు మునీశ్వరులకును, అన్యాధారశూన్యలై — అత్యంతవైరాగ్యకలితాంతరంగలై యలరారుమునికన్యలకును, తద్భూములు నివాసయోగ్యములు. కాని, దేవీ! భీరురాలవు — ప్రియప్రపోషణానుకూలవు వగునీవు కాలముఁగడుపఁదగిన భూములా యవి? అదియునుం గాక, కొలఁదికాలము క్రిందనేకదా పదునాలుగుసంవత్సరములు కాంతారవాసమును గడపి పట్టణమునకుఁ జేరియుంటిమి. మఱల మునిలతాంగులతోఁ గొంతకాలముఁ గడుప నీవరణ్యభూముల కేగుదువని గురులగు వశిష్ఠులును, జనకాదులును, నాతల్లులును విని సమ్మతింతురే? సంరంభ మందుదురే? ఎందులకుఁగాను నీ కిట్టి యభిలాష కలిఁగినది?

సీ. ఉద్యానవనములం । దుండభీతిలు నీవు
భీకరాశ్రమసీమ । వెలయఁగలవె?
పెంపుడుచిలుకనే । పెంపఁజాలనినీవు
కాంతారమృగములఁ । గాంచఁగలవె?
కురులందు విరులనే । కుదుటదిద్దని నీవు
పాదపావళిపూలు । బడయఁగలవె?
చెలులతో రమియింప । సిగ్గునొందెడు నీవు
మునిలతాంగులఁ జేరి । మురియఁగలవె?

గీ. మృదుదుకూలంబులను ధరి । యింపలేని
నీవు వల్కలంబులఁ గట్టి । నెగడఁగలవె ?
ఏల చింతించినావు నీ । వింతకోర్కె
సతుల కిట్టియపూర్వవాం । ఛితము లగునె ?

జానకీ! వాంఛింపఁదగిన దెద్దియైనఁ గోరుకొనుము. కాని మున్యాశ్రమ భూమి నివాసంబును, మునికన్యకలతో స్వైరసంచారంబును నీవంటి సుకుమారికి, శోభనాంగికి యర్హములు కావు. బాగుగా యోజింపుము.

సీత— ఆర్యేశ్వరా ! శ్రేయము లొనగూర్చుచుండువారలు మీరలైన నేనెందున్న నాపదలు సంభవింపవు.

వ. అలఘు బ్రహ్మమయాఖ్యులై, నిఖిల బ్రహ్మాండంబులున్ గుక్షిలో
పల సైరించిన మీరు ప్రాణపతులై । భద్రప్రసాదాత్ములై
వెలయఁగ గానవాసమేమి ? మఱి సద్వ్రతైన నేమి ? మహా
ఫల సంధాయకు లౌట భర్తలు మహాభాగ్యంబు లిల్లాండ్రకుఁ.

నాథా ! మున్యాశ్రమములు నివాసయోగ్యము లందురుకదా !

రాము— జానకీ ! కోరఁగరానిదానిం గోరితివి.

ఉ. భూషణపాళి కావలెనొ ? మూల్యదుకూలములో ? మఱేమియో?
తోషమెలర్పఁ గోరుటలు । తోయలి ! యర్హములౌను నీకిటన్
భీషణజంతుసంయుతము । భీకరమాశ్రమవాసమున్ దపో
యోషలతోడిసఖ్యములు । నొప్పునె నీగతి ముగ్ధరాలకున్ ?

నీ కీయభిలాషవలదు. ఏలనన ?

ఉ. మున్నొకరేడఁ గాంచి వనభూములఁ జెందిన కష్టమంత నీ
కెన్నడు గుర్తురాదె పరికించిన శైళ్యఁ దదాశ్రమంబులన్
మన్ననలీయ నెవ్వరఁట । మాన్యులు, బంధులు, తోడివార లా
పన్నము లందనేల ? వనవాసముఁ గోరఁగఁబోకు మానినీ ?

సీత—నాథా! మీ కనిష్ట మగునెడలఁ బోనిండు.

రాము—జానకీ! నీ మనోభీష్టమునుఁ గూర్చి నీ వంతగా విచారపడ వలదు.

సీత—మనోహరా! ఆర్యపుత్రులగు మీమాటల కన్యథా వర్తించుదునా?

రాము—దేవీ! అదియే కదా స్త్రీలకు సద్భూషణము!—నేఁ డీ యుద్యానవనవిహారముచేఁ మిగుల నలసటఁజెందియుంటివి. ఇఁక నిందుండి వెళ్ళుదము రమ్ము.

సీత—వెళ్ళుదము. (అని యిరువురు నిష్క్రమింతురు)

[తెరపడును]



శ్రీరస్తు.

# కుశలవ

## ద్వితీయాంకము



ప్రదేశము — రాజమార్గము

[భద్రుఁడు — ప్రవేశించును]

ఎంత దారుణము! ఎంత దారుణము!! శ్రవణకఠోరమై, సకల భువన తిరస్కారమైన యీమిథ్యాప్రవాదము వినినది మొదలు నన్నే ప్రబలోన్మాదజనితునిగాఁ జేయుచున్నదే! ఆ రామభూపాలుఁడే యెఱుఁగుచో కటకటా! నిర్దోషురాలగు సీతాలతాంగీవియోగమే కాని యన్యమేమి కలదు? "భద్రా! ప్రచ్ఛన్నముగాఁ బురీవిశేషము లరసికొని రమ్మని కదా" నన్నాతేఁడు పంపియుండిరి. దేవర యెట్లయెఱుఁగుటకు నేనిప్పు డరుదేరి అతిహేయమై, అసాధారణమైన యీజనాపవాదము నెటులఁ దెలియఁజేయుదును? రామచంద్రుఁడు కరుణాసాంద్రుఁడగుఁ బో, దుష్టలోకాపవాదభరితులై, దుర్యశోభారకులగుదురే! ప్రప్రథమమునుండియు పరమపావనమైన రఘువంశమునకు, ముగ్ధరాలగు సీతాదేవిపై వాటిల్లిన నీచాపవాదమునుగూర్చి యెట్టికళంక మేర్పడినను సజ్జనస్తోముఁడు, సద్గుణగణాభిరాముఁడు, రఘురాముఁడు సైరించునే! అసాధారణమై, అఖిలజగతీదూరమైన యీమిథ్యాప్రవాదము సీతాసతీపవిత్రచారిత్రమునకుఁ గళంకీభూతమై, శ్రీరామ

చంద్రసుఖజీవయాత్రావిధానమున కంతరాయమై యింక
నెంతగా నున్నదో ! కటకటా !

గీ. ఎలమిజనులను కన్నబిడ్డలవిధంబు
నేలుచున్నాఁడు రామభూతీశ్వరుండు
కాలవశమున నిందలు కలుఁగుటెల్ల
ప్రజల దురదృష్టపరిపాక పటిమకాదె ?

పురీవార్తాపహారుఁడనై నియమింపఁబడిన నేను వేగమే ప్రభునికడ
కేఁగి యీవృత్తాంతముఁ దెలియఁబలుకక తప్పదు.

(అని నిష్క్రమించును)

[తెఱపడును]

ఇది విష్కంభము.

ప్రదేశము—రాజసౌధము

[రాముఁడు—భద్రుఁడు—ప్రవేశింతురు]

రాము—భద్రా ! గ్రహియించితివి కదా పురీవృత్తాంతములు !

చ. జను లిల నన్నుఁగూర్చి యెటు చర్చలొనర్తురు ? తమ్ములైన నే
మనుదురు? నూత్న వార్త లెఱుఁగంగ సమర్థుఁడవీవు తెల్పుమా
మనమున శంకవీడి కల మాటలు సీతనుఁగూర్చి యేవియున్
మనుమరె యెల్లవారలు సుమంచితవృత్తుల రాజ్యమందునన్.

భద్రు—దేవా ! దేవరపరిపాలనమం దణుమాత్రమైనను లోపము
కలుఁగదు. తమ్ములైనను మీవంటి ప్రాకృతుల నగ్రజునిగాఁ
బడసినందులకు పట్టఁజాలనిసంతసముననే మెలంగుచున్న
వారలు. ప్రజలుకూడ "రఘుకులప్రదీపకుఁడగు రామచం
ద్రుఁడే జన్మజన్మములకు మాకు రాజు కావలయు"నని కోరు

కొనుచు దుర్దశలఁ బాసి, దుఃఖముల వీడి సర్వసౌఖ్యములతో
మెలంగుచుండిరి. పురాణపురుషులైన మీవంటివారలు
రాజ్యమేలుచుండ జనులకుఁ గొఱంత లుండునే ?

రాము—భద్రా ! నీవాక్యములు కేవలము స్తోత్రములుగా నున్నవి.
నవీనవృత్తాంతము లెఱింగింపుము.

భద్రు—జగదీశ్వరా ! యథార్థముఁ బలుకుచుంటిని.

గీ. తండ్రివిధమునఁ బరిపూర్ణ దయఁగలిగి
ధరణి రక్షించు మీదు సత్పాలనమును
మఱగి, తండ్రుల జనులెల్ల మఱచినారు
"తండ్రియే రాముఁ డనుచు" సత్యంబు దేవ !

ఉ. ఆఖరదూషణాదుల హతంబొనరించియు, రావణానుజా
వైఖరిమార్చి, దైత్యపరిపంథిజనంబును ద్రుంచిమించి, ప్ర
జ్ఞాఖనివై జగంబులను గావఁగవచ్చిన దైవమంచు, వి
శ్వాఖిలమెంచుచుందురుకదా ? నిను శ్రీరఘువంశశేఖరా !

కౌమారప్రాయముననే గాధేయయాగసంరక్షకుఁడై దైత్యులఁబరి
మార్చినజెట్టి యవతారమూర్తి కాకుండునే యనువారలును,
పాదరజస్స్పర్శంబున గౌతమపత్నిశాపవిముక్తిఁ గావించిన మా
యామానుషవిగ్రహుఁడు శ్రీమన్నారాయణుండు కాకుండు
నే యనువారలును, నిస్తులంబగు నిటలాక్షుని ధనుర్భంగంబున
సీతంగొనిన మహాబలుండు పురాణపురుషుండు కాకుండునే
యనువారలును, క్షత్రియకులవిధ్వంసకసమర్థుఁడైనభార్గవుని
భంగపరచినలోకాతీతుఁడు పరబ్రహ్మస్వరూపంబు కాకుం
డునే యనువారలును, పితృవాక్యపరిపాలనాదక్షుఁడై విశ్వ
విశ్వంభరారాజ్యభారముఁ ద్యజియించి సతీసోదరయుతుఁడై
కాంతారవాసముఁ గైకొని పుణ్యజనరక్షణశిక్షణభరంబు ధరి

యించిన పరమకరుణాస్వరూపుండు శ్రీమహావిష్ణుండు కాకుండునే యనువారలును, రామరాజ్యంబున జన్మించిన కతంబున ధన్యుల మని యుప్పొంగువారలును, ఆకరుణాస్వభావము, ఆ శాంతహృదయము, ఆ వీరరసమూర్తి రఘుకులంబున శ్రీరామమూర్తికే చెల్లెనుగాని యన్యులకుఁ గలదా యనువారలును, దేవా! యేమిచెప్పుదును? ప్రజలు మిమ్ము వేనోళ్లఁ గొనియాడుచునే యున్నవారలు. "మానవజన్మలకు శ్రీరామనామసంస్మరణమే పాతకహారణంబై, బహుసౌఖ్యసంధానంబై, పరమమోక్షప్రదాయకంబై భాసిల్లుట యబ్బురంబగునే!" యను సంతసమునసే గురువులైనను, తమ్ములైనను, బంధువులైనను సానురాగులై, సాభిప్రాయులై మెలంగుచున్నవారలు కాని—

రాము—భద్రా! అంతరాయ మేమి?

భద్రు—దేవా! ఎట్లు పలుకుదును?

రాము—భద్రా! భయమువలదు. నీస్వామియెదుట యథార్థవృత్తాంతము లన్నియుఁ దెలియఁబలుకుము.

భద్రు—శ్రీరామచంద్రా!

మ. కడుమోహంబున రావణుండు తన లంకకుఁ జేర్పఁగా నచ్చటన్
గడపెం గాలము, త న్నిశాచరుని సంగ్రామక్షితిన్ గూల్చి యా
పుడమీజాతనుఁ దెచ్చి యేలుకొనఁడే మోహంబునన్ రామచం
ద్రుఁడు, రాజౌటదిచెల్లెఁగా ననుచుమంద్రుల్ మిమ్ముభాషింతురున్

రాము—(దుఃఖముతో) భద్రా! ఎంతటిఘోరవార్త వినుట సంభవించినది? ఈరాముని రాజ్య మందింతటివైపరీత్యము కలదా? పరమపవిత్రమై, సకలతాలపవిత్రమైన వైదేహీచారిత్రము నకా యీమిథ్యాప్రవాదము! పాపము శాంతించుఁగాక!

ఈమహాపాపునిజీవయాత్రయం దిప్పు డనివార్యమైన విపమా వస్థ సంభవించినదికదా! ఇంత కర్ణకఠోరమైన వృత్తాంతము నాజనులం దుద్భవించియుండుటకుఁ గారణమేమై యుండును? నాప్రజలు దుర్నీతిపరులును, దుష్టమార్గప్రవర్తకులును కారు కదా! మున్నాదశకంధరవధానంతరమున దోషురాలుగా దేవినిఁబరిత్యజింప నెంచిన నా కశరీరవాణియు, నగ్నిహోత్రుఁడును, మీఁదుమిక్కిలినాతండ్రియగుదశరథుండును, "సీతముద్దరాలు, దోషవిహీన" యని పలుమా ఱుద్ఘోషించినపలుకులయం దన త్యలేశమే సంభవించుచో నశరీరవాణియమృతవచోవిలాసినియు వీతిహోత్రుఁడు విశ్వవిశ్వంభరావిఖ్యాతుండును, తండ్రియగు దశరథుఁ డమరేంద్రాస్థాననాలంకారుఁలగుటయు సంభవింప దుకదా! కటకటా! యీనీచాపవాద మెందులకుఁగాను జని యింపవలయును? అతిపావనంబై, అఖిలజనాహ్లాదంబై, పెద్ద కాలంబునుండి వర్ధిల్లుచున్న యీరఘువంశమునకు నేటికినర్వ జగత్స్తవనీయచారిత్రి, సాధుశీల యగు సీతాదేవిమూలము న నట్టికళంకము వాటిల్లినను రాముఁడు సైచునే? ఛద్రా! సీతాసతీపాతివ్రత్యము సర్వజగద్విశదమేకదా! సమస్తజనసం స్తవనీయమేకదా! అట్టిపాతివ్రత్యవిశేషమునకు నేడేమి యంతరాయము కలిగినది? అవాచ్యమై, అతిహేయమైన యీనీచాపవాదము రఘువంశమునకుఁ గళంకమేకదా! పావ నమైనవంశములఁ గూర్చి పామరులసైత మర్పింపవలయు ను. జానకీపాతివ్రత్యనిర్ణేతలవాక్యములకే యన్యథాత్వములు సంఘటిల్లిన నింకలోకంబులేమి? హా! జానకీ! హా! నిమివంశవ ర్ధనీ! నీవు పరమ పతివ్రతామణి వైనను, నిఖిలజగ త్స్తోత్రచారిత్రివైనను నిర్భర నీచాప వాదమునకు భార కురాలవైతివి. ఆపాపిష్ఠిబ్రహ్మ నీజీవితమంతయుఁ గష్టము

లతోఁ గదుపునట్టుగనే లిఖయించెనుకాఁబోలు! నీవంటి సద్గుణశీల, నీబోటిపరమపుణ్యా యుభయవంశములకు సానురాగమై, సత్కీర్తిసంధాత్రివై శోభిల్లుననుమాటయుం దసత్యముండె యుండదు కాని, జానకీ! కాలపరిపాకమున లోకములకుఁ గొఱగాకయుండి దురంతచింతాసాగరనిమగ్నవై, దురితజనాపవాదభరితవై నీజీవితమును వెడలఁబుచ్చవలసినదానవైతివే! హా!! జీవితేశ్వరీ! యింతటి మహాపాతకమునకుఁ గారణమేమైయుండును? (కొంచెమాగి) ఏదియైన నాఁగాఁక! ప్రభుఁడనగు నేను ప్రజారక్షమున నేమి పత్నీవిషయమున నేమి కర్తవ్యము విచారింపవలయునుకదా! నాదాక్షిణ్యవిశేషమున నేమి, జానకీదురదృష్టపరిపాకమున నేమి సంభవించిన యీహైన్యాపవాద మంతరించుటకు దేవీపరిత్యాగమే కర్తవ్యముగా నున్నట్లు తోచుచున్నది. హా! దేవీ! నిర్మలాంతఃకరణవు, నిస్తులపుణ్యశీలవగు నీవిషయమై యిట్టిసాహసకార్యమెటులఁజేయుదును? ఎటులో సాహసించి చేయనిపక్షమున లోకులనిందలకుఁ బాత్రుఁడనేకదా!

ఉ. ఈయపరాధమెట్లు భరియింతు విదేటికిగాను గల్గెనో?
పాయని యెన్నినాళ్లకును? పౌరుల కీ యవినీతిమార్గ మే
లా యనుభావ్యమాయెనో? యిలాసుతజీవితమంతయింతగాఁ
జేయుటన్యాయమా విధీ! నేమము లే దురదృష్టశాలికిన్

విచారముతోఁ బనియేమికలదు? ఇక్ష్వాకుకులసంజాతులు సత్యమార్గప్రవర్తకులును, సత్కీర్తివిశాలురు కదా! అట్టిసద్వంశము నేఁటికీజనకతనయమూలమున నపవిత్రము కానున్నచో నింక నాజన్మము కాల్పనే? భద్రా! నీవిప్పుడు వేగిరమేచని నాయాజ్ఞగా లక్ష్మణ,భరతశత్రుఘ్నులఁ దోడ్కొనిరమ్ము-

భద్రు—చిత్తము. (అని నిష్క్రమించును.)

రాము—(దుఃఖముతో) హా! దేవీ! నిరపరాధవు, నిండుచూలాలవగు నీయందిట్టి ఘోరనిర్ణయమెట్లు నిరాటంకముగాఁ గొనసాగింపనేర్తును? అకారణముగా సంభవించిన యీహైన్యాపవాదమునుగూర్చి నిన్నడవులపాలుజేసిన లోకంబులు నన్నవ్విధమెట్టుగా భావింతురో? ఎంతకర్కశహృదయునిగాఁ జింతింతురో? ఆనాఁడాపితృవాక్యముంబట్టి యనుభవింపవలసివచ్చిన పదునాలుగేండ్ల కాంతారవాసమే ఘోరమైనను, క్రూరమైనను భర్తయు, మఱఁదియు వెంటనుండిరి. కావునఁ గడపితివి. దేవీ! యీనాఁడీప్రజావాక్యముఁ గూర్చి వెడలఁబుచ్చగానున్న యీ జన్మాంతగహనవాసము నెవరియండనుఁ జూచుకొని స్వీకరించెదవు? దైవమందువా? అంతకారుణ్యహృదయము, అట్టి ప్రేమ స్వభావము అటువంటిదీనజనరక్షణశక్తివిశేషము కలిఁగియున్న యాదైవమిప్పుడీ మిథ్యాపవాదతటస్థకాలమున నేమైపోయెను ? సాధ్వీ ! ఆనాఁడుద్యానవనవిహారాంతమున, "గంగాతీరమందలిమున్యాశ్రమభూములందు మునికన్యకలతోఁ గొంతకాలముఁ గడపఁ గుతూహలము కలిగిన" దని పలికిన నీవాంఛితమే యశుభసూచకమై, అత్యంతశోకకారణమై నీ కాజన్మాంతారణ్యవాసమునే స్థిరపఱచుచున్నది. దేవీ! పావనమహీనందనీ! యీరాజధర్మము నన్నింతపాపాత్మహృదయునిఁగాఁ జేయుచున్నది! ఇంకను మనకు శుభదినములు కలవా?—ఉన్నచో నిట్టి యపూర్వవృత్తాంతములు సంభవించుటకలదే? హా! జానకీ! హా! మనోహరీ!

ఉ. నిన్నటుబల్కినట్టి జనులు న్నిర్భరపుణ్యవు, సద్గుణవ్రజం
బున్నదినీయెడన్, మెఱుఁగ నుండిరె లోకులుమాత్రమింతయున్

ఎన్నటికైనఁగాని నశియింపని దుర్దశలంచు నెందితిగా
ము న్నటవీనివాసమున ముద్దియ! యీతటి నేమిధైర్యముల్?
కాలవశమునఁ దటస్థమైన యీకష్ట మెట్టిదైనను నేనీక నాజన్మాంత
మనుభవింపక తప్పదుకదా?—(అని యూరకుండును.)

(లక్ష్మణ భరతశత్రుఘ్నులతో భద్రుఁడు మఱలఁ ప్రవేశించును.)

లక్ష్మ—(తనలో) ఏలనో కాని యగ్రజుఁడగు రామమూర్తి విషాదమున
స్కుఁడై యున్నట్లు పొడఁగట్టుచున్నవాఁడు. అశుభములేమి
యు వాటిల్లియుండవుకదా!

భర— } (తమలో) అన్నగారిట్లుఖిన్నులై యుండుట కాపత్తులేమి
శత్రు— }
సంఘటిల్లియుండును?

భద్ర—(తనలో) ప్రభుప్రుగారు దేవిమెడఁ గూర్చినిర్ణయము సంక
ల్పింపలేదుకదా! ఈ యర్థరాత్రమున వీరల నిచ్చటకుఁ బిలు
వనంపుటకేమి యోజించియుండిరో?

రాము—(తమ్ములఁజూచి దుఃఖముతో) తమ్ములారా! వింటిరా! లో
కులు సీతాదేవిపైఁగూర్చిన మిథ్యాప్రవాదము!

లక్ష్మ— }
భర— } అగ్రజా! మిథ్యాప్రవాద మేమి?
శత్రు— }

రాము—సోదరులారా! ఏమందురా?

ఉ. అంకమునందుఁజేర్చి కుసుమాస్త్రనికోలలకోర్వలేక ని
శ్శంకతరావణుండు మదసంయుతుఁడైగొనిపోవ నేకదా
లంకకు సీత నచ్చట మెలంగినవల్ని ని సాధ్వియంచు నే
జంకును లేక యేలుకొనసాగె రఘూత్తముఁడెట్లు వెల్లువల్లనో

అని పౌరులు నీచాపవాదముఁ గావించిరఁట! తమ్ములారా! రఘు కులసంజాతులు దుర్యశోభారకులు కారు. నిజవంశమునకు హానిసంభవించునప్పుడు జీవములనైనత్యజించుటకు సంసిద్ధులు. అట్టిదీక్షాబద్ధులైకదా మనతండ్రిగారు మున్ను నన్నును, మీదుమిక్కిలి తమ ప్రాణములఁగూడఁ గోల్పోయిరి! అఖిల సద్గుణశ్లాఘ్యయగు సీతాదేవిపై సంభవించిన యీమహాన్యాప వాదము దురితసంయుతమై, దుర్భరశోకకారణమై, దుర్య శస్సంధాయకమై యింక నెట్లుగాఁ బరిణమింపనున్నదో? ఎట్లో యననేల? దేవీపరిత్యాగమే యిందులకుఁ గర్త వ్యమై యున్నది.

లక్ష్మ—(దుఃఖముతో) రాఘవేశ్వరా! యిట్టి యవాచ్యములు మన రాజ్యమందు కలవా? జానకీదేవి పాతివ్రత్యవిశేషము, పవి త్రచారిత్రము తెలియఁగనివార లెవరు? ఆసాధ్వియందు దోష మారోపించుట మహాపాతకమునకు హేతువే. కాని యన్యమే మి? సీతవంటి సద్గుణశీల కోడలగుటచేకదా మనతండ్రియగు దశరథేశ్వరుఁడుకూడ యమరలోకాలంకారులై, ఆదిత్యగణ దేదీప్యమానులై శోభిల్లుట తటస్థమాయెను. అదియుఁ గాక యే యవనీజాతయై వర్ధిల్లుటచేకదా పాపజనసంహారము, భక్త కోటిసంరక్షణము లోకములందు కొనసాగుచున్నవి! వైదే హీదేవియే యపవిత్రురాలైన నశరీరవాణియు, నగ్నిహో త్రుఁడును యేమగుదురు?

ఉ. దోసము లేదు సీతయెడ, దుర్జనవాక్కులఁబాటి చేసినన్
మోసమువచ్చు, నాజనకపుత్రిచరిత్ర పవిత్రమాటకే
పీసము లేదు సంశయము, విశ్వములైననెఱుంగు, గర్భసం
భాసిత యిప్పుడాయమవతిఁ బాయుఁగ ధర్మమె నీకు రాఘవా!

పలుగాకియగు నొవఁడో యొకఁడాడినమాటనుఁగూర్చి పరిశుద్ధురాలగు సీతాదేవియెడ ఘోరనిర్ణయము సంకల్పింపవలదు.

భర—
శత్రు—
(దుఃఖముతో) అగ్రజా! వైదేహి నిష్కళంకముగా సర్వజగ త్స్తవనీయచారిత్ర. లేక లేక నేఁటికిఁగదా యీ రఘుకులంబున కంకురము లేర్పడునని యెల్లరము సంతసించుచున్నారము. నిర్భరగర్భభారమై, నిర్మలచిత్తశోభయై, నిరతము మీసేవయందే, మీస్నేహమందే కాలము వెడలబుచ్చుచున్న యీ జనకపుత్రి నకారణముగా మీరు పరిత్యజింపవలదు.

భద్రు—దేవా! ముగ్ధరాలగు సీతాదేవిపై మీకరుణాకలితదృష్టులఁ దొలంగింపకుఁడు.

రాము—తమ్ములారా! మంచివాక్యములఁ బల్కితిరి. కాని యిట్టి హైన్యాపవాదముతో మెలఁగుట మనము జీవచ్ఛవములమే కదా! పూజ్యమైన రఘువంశమునకుఁ గళంకభూతులమే కదా! సత్యముఁదప్పక, స్వాన్వయహానిఁ జేకూర్పక శాశ్వతకీర్తులై మెలంగిన సత్యహరిశ్చంద్రాదిసాధుప్రవర్తనము లెఱిఁగినవారమైనను మనము ప్రవర్తించుట శ్రేయస్కరముకదా! కావున వంశోద్ధారకులమైన మనకిప్పుడు సీతాసతీపరిత్యాగమే కర్తవ్యము. కాని యన్యము లేదు. అది యెట్లందురా?

మ. అలగంగానది భూములందుమునిక(న్యా శ్రేణితోఁగూడి, యి
చ్చలు వర్తింపఁగ నెంచియున్నదికదా ( యూర్మిజాత, తత్కారణం
బు లతాంగిన్ బనుపంగ నెంచితి వనం(బుల్ జేరగా, హైన్యవా
ర్తలసైరించెడుమానవుల్ బ్రతుకు వ్య(ర్థం బీధరామండలిన్.

లక్ష్మ
భర
శత్రు
అమంగళము శాంతించుగాక!

భద్రు—(తనలో) పాప మెఱుఁగని యీ భూపుత్రిజీవితమంతయు కడగండ్లతోనే కూడుకొనియున్నదికదా?

లక్ష్మ—అగ్రజా! నిర్దోషయగు జానకీదేవియెడ యింతకాఠిన్యము వలదు.

భర శత్రు—రామచంద్రా! కానిసమయమున నాభీరురాలుకు కాననవాసము తగదు.

రాము—తమ్ములారా! నాయీపలుకుల కన్యథాత్వము లేదు. (లక్ష్మణునిఁజూచి) సౌమిత్రీ! యీకార్యమునకు నిన్నే నియమించితిని. వేగిరమే రథము సిద్ధముఁజేయించుకొని, గంగాతీరమున్యాశ్రమనివాసనెపంబున, సీతాదేవిని కాంతారభూముల విడచిరమ్ము. యథార్థవృత్తాంత మంతయు మఱలి నీవు చనుదేరి వచ్చునప్పుడు దేవి కెఱిఁగింపుము. కాని యిప్పుడుమాత్రము వెలుపరింపవలదు.

లక్ష్మ—(తనలో) హా! హతవిధీ! యీఘోరకార్యము నావలనే కావలసియున్నదా?

రాము—తమ్ముఁడా! శంకింపకుము. కాలవశమున సంభవించుకష్టములకు చింతిల్లుట తగదు. ఇంత నీచాపవాదముతో సీతయిందుండుటకంటె మున్యాశ్రమములందుననే జీవితముఁ గడుపుట యోగ్యముగానున్నది. నిజకులమునకు హానియుఁ జేకూరదు. కాన శీఘ్రమే నీవేగి ప్రయాణసన్నాహముఁ గావింపుము.

లక్ష్మ—చిత్తము. అటులనే?—

రాము—తమ్ములారా! యిఁకఁ బొండు. (భద్రునిఁ జూచి) భద్రా! నీవుకూడ పొమ్ము.

[తెఱపడును.] (అందఱు నిష్క్రమింతురు.)

శ్రీరస్తు.

# కుశలవ

## తృతీయాంకము.

ప్రదేశము:—ఉద్యానవనము.

[మల్లిక, చతురిక ప్రవేశింతురు.]

మల్లి—చెలీ! దేవిగారు వెళ్ళినప్పటినుండియు నామనస్సేమో పరిపరి విధములఁ బోవుచున్నది. ఆమెపేరు తలఁచుకొనినమాత్రమున నాకుఁ బట్టఁజాలనిదుఃఖము పొంగి పొరలివచ్చుచున్నది. ఏమియుఁ దోచకున్నదికదా!

చతు—మల్లికా! నీకేకాదు. నాకుఁగూడ యట్లే దిగులుగానున్నది. ఆసాధ్వివెంట మనముకూడ నేగిన బాగుగానుండెడిది.

మల్లి—చతురికా! సీతాదేవి ప్రయాణమే యనాలోచనగా జరిగినది. సౌమిత్రివచ్చి కొనిపోవునంతవఱకు నామాత్ర మీసన్నాహ మెఱుఁగుననుకొంటివా? లేదు. లేదు. అప్రయత్నముమీఁదనే దేవి కిది తటస్థమైనది.

చతు—సఖీ! జానకీదేవి వెళ్ళి యిప్పుడే నేఁటికి మూఁడుదినములైనది కదా!

మల్లి—అప్పుడే యందు వేమి? కాలమెంతలోఁ గడచిపోవును! అంతగా మనము గ్రహియించలేదుగాని, దేవినిఁ గొనిపోవుటకు వచ్చినలక్ష్మణుని ముఖచిహ్నములే యాప్రయాణముయొక్క విషయమును వెల్లడించినవిసుమా!

చతు—సఖీ! సంశయముగానేయున్నది! కాని జానకీదేవి ప్రయాణము కంగీకరింపక తప్పదుకదా! మఱిదియొక్క ముఖలక్షణము లామెకూడ యెఱింగికొనియుండదు. మార్గరాలు సంతసము ననే ప్రయాణమైనది.

మల్లి—సంతస మెట్లులేకుండును?—జానకీదేవి యుద్యానవనవిహారమున విభుని గంగాతీరమున్యాశ్రమభూములందు మునికన్యకలతోఁ గాలముఁ గడుపఁ గోరినదఁట! అందులకుఁగాను ప్రభుఁడగు రామచంద్రుఁడు తన కీప్రయాణముఁ గావించెనని వారితోఁ బలికినది.

చతు—పరిపాటిఁ బాటింపలేదు. కాని ప్రయాణ మప్పుడుదుశ్శకునములైనవి. మల్లికా! ఓపలేనిదికదా! జానకీదేవి కిప్పుడీకోరిక మాత్ర మెంతసమంజసముగానున్నది?

మల్లి—అత్తలకును- ఐనవారలకు నెవ్వరకు నీసీతాదేవిప్రయాణ మంత సమ్మతముగా లేదు కాని యామెకుఁ దప్పినది కాదు.

చతు—ప్రప్రథమమున దేవిగారికోర్కె రాఘవేశ్వరుఁ డొల్లలేదఁట కదా! మఱల నిప్పు డేల యిట్టియాజ్ఞ నొసంగియుండిరో?

మల్లి—(నలుదెసలఁ బరికించి) సఖీ! యిం దెవ్వరును లేరుకదా! ఒక రహస్యము వింటిని. "రావణాసురుని లంకలోఁ గాలముఁగడపియేగుదెంచినజానకీదేవి పతివ్రతయే యని రాముఁడు మరల యేలుకొనుచున్నవాఁ"డని పురములో నపవాదములు బయలుదేఱినవఁట! అది ప్రభుఁ డెఱింగికొనినాఁడు.

చతు—మల్లికా! అందులకేనా సీతాదేవి కిప్పుడీగంగాతీరమున్యాశ్రమనివాసము!

మల్లి—అనియే నాసందేహము! ఈరహస్యము నీవెందును వెల్లడిఁ జేయవలదు.

చతు—పాపము!—దేవిగారి కీవృత్తాంతము తెలియదు కాఁబోలు! ఎంతకష్టము సంభవించినది! విభుఁడు తనకోర్కెఁ దీర్చెనని పట్టలేనిసంతోషమున ప్రయాణమైనది గాని, యామూర్ధరా లది విషమమని గ్రహియింపలేదుకదా! మల్లికా! యీరహ స్యము నీ వెప్పుడు భేదించియుంటివి?

మల్లి—చెలీ! నేటియుదయముననే యీగోప్యము నాకర్ణములఁ బడి నది. నీవుమాత్ర మెందును ప్రకటింపవలదు సుమా!

చతు—మల్లికా! వెల్లడించుటకు నా కేమిపనియున్నది కాని, సీతారాముల పునస్సంయోగభాగ్య మెప్పటికైన నున్నదా?

మల్లి—చతురికా! అందులకు దైవమే కలఁడు. వెళ్లుదము రమ్ము.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

(తెఱపడును)

(ఇది విష్కంభము.)



ప్రదేశము—మార్గము.

[లక్ష్మణుఁడు,సుమంత్రుఁడు,సీత రథముపై బ్రయాణముఁ గావించుచుందురు.]

లక్ష్మ—సుమంత్రా! మార్గము కంటకముగా నున్నట్లున్నది. రథము మెల్లగనే పోనిమ్ము.

సుమం—దేవా! భాగీరథీభూములఁ బ్రవేశించియుంటిమి. మెల్లగనే పోనిచ్చెదను.

సీత—సౌమిత్రీ! జాహ్నవీభూములు పుణ్యవంతములందురుకదా!

లక్ష్మ—(తనలో) కటకటా! దోషమెఱుఁగనియీముద్దరాలి కేమి

యిక్కట్టులు సంప్రాప్తములో కదా! (ప్రకాశముగా) సాధ్వీ! పుణ్యవంతములైన భూములకే యరుదెంచితిమి.

సీత—(తనలో) మఱి దిలక్ష్మణుఁడు ప్రయాణమాదినుండియు చింతాయత్తచిత్తుడై యున్నట్లు కనఁబడుచున్నవాఁడు. కారణము తెలియకయున్నదిగదా! (ప్రకాశముగా) మఱఁది! ఏలనో కాని నాకుడిపార్శ్వ మంతయు నదరుచున్నది. ఏమికీళ్ళును లేవుకదా!

లక్ష్మ—(తనలో) అయ్యో! ఇదియు నశుభసూచకమేగదా! ఏమి తెలుపుదును? ఎట్లుదెలుపుదును? (ప్రకాశముగా) జానకీ! రథము నింకమెల్లగఁ బోనీయుదునా?

సీత—సౌమిత్రీ! ప్రయాణ మాదినుండియు నీచిత్తమన్యథా వర్తించుచున్నట్లున్నది. అదియునుఁగాక; మొదటినుండియు మనకు దుశ్శకునములే సంభవించినవి. హేతువేమి నాయనా! మఱల నాపదలేమైనఁ గలవా?

లక్ష్మ—(తనలో) దైవమా! ఏమిపల్కుదును? ఈపావనచరిత్రజీవయాత్రకుఁ దటస్థించిన యీ యంతరాయమును, యీ హైన్యాపవాదమును తెలియఁజేయుదునా? తెలియఁజేయకుందునా? "యథార్థవృత్తాంతమంతయు మఱలి నీవు చనుదేరి వచ్చునప్పుడు దేవికెఱింగింపుము గాని యిప్పుడుమాత్రము వెలువరింపవల" దనికదా యన్నగా రాజ్ఞాపించియుండిరి.

సీత—సౌమిత్రీ! కొలువుకూటమందుండినవారగుటచే నే నరుదేరునప్పుడు నాథుని దర్శింపఁజాలనైతిని. ఆర్యపుత్రులకు భద్రమేకదా! ఏలనో కాని మున్నెఁడునులేని నీవీప్రయాణమందు మిగుల ఖిన్నమనస్కుఁడవై తోఁచుచున్నవాఁడవు. నీ యీవికారమునకుఁ గారణమేమికలదు?

లక్ష్మ—తల్లీ ! రామచంద్రుఁడు కుశలుఁడు. అగ్రజుని యాజ్ఞాబద్ధుఁడ నైకదా యీకార్యమున కేగుదెంచితిని.

సీత—మఱఁదీ ! అట్లందువేమి ? అమంగళము లేమిమైనఁ గలవా ? నీవాక్యములు నాకు హృదయమందు భీతినిఁగొలుపుచున్నవి. ఆర్యపుత్రునిఁ జూచువేడుక కలుగుచున్నది. ఈప్రయాణము నాకేమియు సంతసకరముగా లేదు.

లక్ష్మ—(తనలో) దైవమా ! యిప్పుడేమిచేయుటకుఁ దోచకున్నదికదా ! (ప్రకాశముగా) నవనమహీనందనీ ! భీతినొందకుము. గంగాభవానిని సమీపించినారము. (సుమంతునిఁ జూచి) సుమంత్రా ! రథమిచ్చటనే యాపుము.

సుమం—చిత్తము. (అని రథమాపును.)

లక్ష్మ—జానకీ ! మనమింక దిగవలయును.

(అని యందరు దిగుదురు.)

సీత—మఱఁదీ ! పరమపావనియగు భాగీరథిని దర్శింపుదము రమ్ము.

(అని యందరు గంగను సమీపింతురు)

లక్ష్మ—వైదేహీ ! కంటివా యీ గంగాప్రవాహము !

మ. హరిపాదంబులఁబుట్టి, లోకముల కాహ్లాదంబు చెల్వార, యీ
శ్వరజూటంబునఁజొచ్చి, సాగరులమోక్షప్రాప్తులంజేయ, ని
ర్భరపుణ్యాత్ముఁడౌ భగీరథుని యుగ్రస్తోత్రమాలించి యీ
ధరకేతేరఁదరంగఘోషకలితోద్యద్వాహినీరత్నమై.

సీత—అమ్మా ! జాహ్నవీ! అభివందనము. (అని నమస్కరించును.)

సీ. శ్రీమహావిష్ణుని చెలువారు పాదప
ద్మంబులమహిత జన్మంబుఁగాంచి,
జంభారిపురివీడి చనుదెంచుచున్నచో,
శివునిజటాజూటసీమనిలచి,

జగములఁ సాత్త్వెంచి నిగుడించి పాఱుచో,
జహ్నుమునీంద్రయాశ్రమముఁ జూచి,
మునుభగీరథుఁడు చేసిన ఘోరతపమున
సగరాత్మజులకు మోక్షమునుఁ గూర్చి,

గీ విశ్వనాథునిపురిఁ జూచి వెడలినావు
పావనంబా మె, భూకాంత భాగ్యమేమొ ?
వందనంబులఁ గొనుము పేర్మిమందలిర్ప
కల్పగుణవల్లి ! దివిజగంగామతల్లి !

లక్ష్మ—జానకీ ! మన మాగంగానదిని దాటవలయును. ఆవలియొడ్డున కదా మున్యాశ్రమములున్నవి. (సుమంత్రునిఁ జూచి) సుమంత్రా ! ఆవలిదరి జేరుటకొకపడవ నొడ్డునకుఁ బట్టింపుము.

సుమం—దేవా ! యిచ్చటనే యున్నది రండు.

లక్ష్మ—మైథిలీ ! ఆపడవ నెక్కుదము రమ్ము (సుమంత్రునిఁ జూచి) సుమంత్రా ! నే నీసాధ్విని యావలియొడ్డునంగల యాశ్రమ భూములడించి వచ్చెదను. నీవు నేను వచ్చునంతవఱకు రథముకడ నుండుము.

సుమం—చిత్తము. (పడవఁ జూపి) దేవా ! దీనియందెక్కుఁడు.

లక్ష్మ—సీతాదేవీ ! రమ్ము. (అని యిరువురు పడవనెక్కి. గంగను దాటుదురు.)

సీత—సౌమిత్రీ ! యిచ్చటనుండి మన మింక నడువవలయునా ?

లక్ష్మ—సాధ్వీ! కొంతదూరము శ్రమపడవలయును. కోయకొని తెచ్చుకుంటివికదా ?

సీత—మఱఁదీ ! కారణ మేలచెప్పవయ్యా? నీమానసము దుర్భర దుఃఖపూరితమై యున్నట్లున్నది. ఏమికిట్టుచు లేవుకదా ?

లక్ష్మ—పతివ్రతాశిరోమణీ! కాలము మంచిదికానప్పుడు కదా కీళ్ళు సంభవించుట!

సీత—లక్ష్మణా! నీవాక్యము లమంగళముసే సూచించుచున్నవి. హేతువు వచియింపవు. సాకేతపురము భద్రమేకదా ?

లక్ష్మ—అమ్మా! సమస్తము భద్రము. భయమేల చెందెదవు?

సీత—నాయనా! భయమునకేమి మోసమువాటిల్లినది ? ప్రయాణమప్పుడు నీవు మాయన్నగారిని జూచివచ్చితివికదా! కష్టములుపడియున్న ప్రాణులము. మఱల నేమిస్పృహకువచ్చినను భరియింపఁజాలని దుఃఖము కలుగును. ఏమియైన వృత్తాంతములున్న వేగమెఱింగింపవయ్యా!

లక్ష్మ—జానకీ! ఎట్లు తెలుపుదును? ఇంతకఠినకార్యము నిర్వర్తించుట కింక నీ లక్ష్మణుఁడే బ్రతికియుండవలయునా? (అని దుఃఖించును.)

సీత—(దుఃఖముతో) నాయనా! అంతగా దుఃఖంచెద వెందులకు ? కఠినకార్యమేమి? ఏమి యుపద్రవము సంఘటిల్లినది? నాయనా? తెలుపవా ?

లక్ష్మ—(ధైర్యముతో) పతివ్రతాశిరోమణీ! నీవు దోషవిహీనవు. శ్రీరామచంద్రుఁడును ఘనపుణ్యచారిత్రి మెఱిఁగిన దయాకరుఁడే! కాని—

సీత—(దుఃఖముతో) నాయనా! మఱల నేమియుక్కట్టులు సంప్రాప్తమైనవి ?

లక్ష్మ—అమ్మా! నీ కాదైవమే తోడ్పడవలయును.

మ. అసురాధీశుని రాజ్యమందు బహుకాలం బెట్లొ వెళ్ళించిన
ట్టి నరిఁగ దెచ్చి పవిత్రయంచు పరిపాటిన్ రాఘవుం డన్న, యా

వినమావస్థకు లోకులం దెలసి న । న్వీడంగఁ బంపించె, న
న్న, సరోజానన ! జాహ్నవీమహితప్రాం।తంబందు నిన్నింతటన్.

సీత—హా! శ్రీరాఘవేంద్రా!—(అని మూర్ఛిల్లును)

లక్ష్మ—(దుఃఖముతో) అక్కటకటా! ఎంతఘోరము సంభవించినది? ఏమి చేయుదును? నిర్భరగర్భభారయగు నీయిల్లాలు మూర్ఛ నొందినది. ఏమి యాపదమూడునో కదా! దైవమా! ఎవరుతోడు ? ఈసాధుశీల మూర్ఛనుండి తెలియు టెట్లు ?—(అని రాము నుద్దేశించి)

శా. శ్రీరామప్రభుపాదపద్మయుగసం।సేవ్యుండనై యుందునే
నీ, రమ్యస్తుతశీలమై తనరునే । నీ యీమహీజాతయున్
గారుణ్యాత్ముఁడు రాఘవుండు ప్రజలం । గాపాడువాఁడేని, యీ
నారీరత్నము మూర్ఛనుండి తెలియున్ । నానాజగజ్జాలముల్.

సీత—(మూర్ఛనుండి లేచి) సౌమిత్రీ! ఏమి పల్కితివి? భాగీరథీతీర మున్యాశ్రమములకు కాదా నన్ను మీయన్నగారంపియుండిరి! అలనాఁ డుద్యానవనవిహారమున నేను నాథున కెఱింగించిన దీవాంఛితమే కదా! ఇదికాక; మఱఁది! నా కీవనవాసమున కన్యకారణమేమి కలదంటివి?

లక్ష్మ—అమ్మా! జానకీ! అగ్రజుఁడగు శ్రీరామచంద్రుని యీ యాజ్ఞ నిర్వర్తించుటకే యింక యీపాపిష్ఠి లక్ష్మణుఁడు బ్రతికి యున్నవాఁడు. నిరపరాధవగు నిన్నింతటి కష్టములందు దిగనాడిన యీ మహాపాతకుని శపియింపుము. సాధ్వీ! శ్రీరామచంద్రుఁడు నీయందు సానురాగుఁడు—సదయహృదయుఁడు—సాభిప్రాయుఁడు; కాని పలుగాకులగు లోకులాడు మాటలకు, పరమ ధర్మస్వరూపము, పౌరుషమూర్తియు, ప్రజారంజకుఁ డగుటచే సహియింప నోల్లక, తన్మిథ్యాప్రవాదహరణారకై

నిన్ను భాగీరథీభూముల డించిరమ్మని నన్నాజ్ఞాపించి యున్నవాఁడు. తల్లీ! అగ్రజునియాజ్ఞ నాకవిలంఘనీయమని నీవెఱుఁగుదువు కదా!

సీత—(దుఃఖముతో) లక్ష్మణా! యింతటి మిథ్యాప్రవాదము సాకేతపురమున బయలువెడలినదా? దురదృష్టజాతకురాలను కావుననే కరగ్రహణమైన నాఁటనుండియు సుఖమైన కాపురమే కుదుటఁబడక యిప్పటికిని కాననములలోననే నా బ్రతుకు గడుపవలసి వచ్చినది హా! విధీ! యీ దురదృష్టురాలియెడ యింతయనాదరదృష్టి నిలిపితివేల? మఱఁదీ! యింతటి వార్త ప్రయాణమప్పుడే యేల యెఱింగింపవైతివయ్యా? నాసౌశీల్యము, నాచారిత్రము సంశయాస్పదమై, సర్వజనవిదూరమైన నాఁగాక, పావనంబైన రఘుకులంబునకుఁ గళంకము కాని, భవ్యగుణసాంద్రులగు శ్రీరామచంద్రమూర్తికి దుర్యశము కాని సంభవించుచో నింక యీజన్మము కాల్పనే! ఎఱుఁగుదును కదా నాచారిత్రము విశ్వలోకపవిత్రుఁడైన వీతిహోత్రుఁడు! విశదమే కదా నాపాతివ్రత్య మా యశరీరవాణికియు, నాదిత్యలోకాలంకారులైన మీతండ్రి దశరథేశ్వరులకును. మున్నిందఱేకగ్రీవముగా పవిత్రమని నాచారిత్ర మెఱింగించిన పిమ్మట కదా మీ యన్నగారు, "జానకి ముగ్ధరా"లని నన్ను స్వీకరించియుండిరి! మఱఁదీ! ఇంతలో నిట్టిహేయాపవాదము కలుగుటయు, ప్రాణేశ్వరునికరుణకపాత్రురాలనగుటయు, నాదౌర్భాగ్యపరిపాకమని చింతిలెదను. కాని, మఱఁదీ! యీజన్మమునకిఁక నాకు శుభదినములు లేవుకదా! ఉద్యానవనవిహారాంతమందానాఁడు నాథునకసమ్మతమైన నాయీకోరికయే నన్నాజన్మాంతదిం

తాయత్తనుఁగా- అనంతకష్టసంభృతనుగాఁ జేసినది. లక్ష్మ ణా! నీ వనినపరిహారము నేఁ నీకడగండ్లు కోరుకొనియే తెచ్చు కొంటిని. లోకులమాటలఁబట్టియే నీయన్నగారు నాకీ కేకార ణ్యవాసము విధించియుండిరా? లేక నాయెడ ననివార్యసంశ యాత్మకులై, అకారుణ్యభావులై నిన్నాజ్ఞాపించియుండిరా? ఇప్పటికైన సత్యముఁ దాఁచక వెలువరింపవయ్యా?

లక్ష్మ—తల్లీ!! వైదేహీ! రాఘవేశ్వరుఁడు నీయందు పరిపూర్ణానురా గుఁడు, పరమకళ్యాణ సంధాయకుఁడే కాని—

మ. వదినా! నీపయి నిందబుట్టినది, సంభావించి మాయన్న నిన్ గదలంజేసెను కాననంబులకు యోగ్యంబౌటచే నట్టులే సుదతీ! రాముఁడు ధర్మశాలి నిజవంశోద్ధారణోత్సాహుఁడై యదయత్వంబు వహింపఁగావలసె మిథ్యాలోక సంబంధుఁడై.

అలనాఁడు మాయదారి మొకముఁగూర్చి నిన్నాకూరరావణున కప్పఁ జెప్పిన మహాపాతకము యీనాఁడీలోకనిందనుగూర్చి నిఁడు చూలాలవైనను భీకరారణ్యభూములందు డించినఘోరకిల్బి షము నన్నాకల్పాంతము బాధింపకమానదు. అమ్మా! యిట్టి ఘాతుకకార్యనిర్వాహంబునకే యీలక్ష్మణుఁడు జన్మ మెత్తి యున్నవాఁడు.

సీత—సౌమిత్రీ! నీయట్టి సదమలజ్ఞానుఁడు, సన్మార్గప్రవర్తకుఁడు నా కు మఱఁదియగుటచే నిక్కముగా నాజన్మము ధన్యతఁబొంది నది. జన్మజన్మములకు రాఘవేంద్రుఁడే భర్తయై లక్ష్మణుఁడే మఱఁదికావలయునని వివిధవేల్పులకు మ్రొక్కుకొనెదను. ఏమిమిథ్యాప్రవాదములు తటస్థించినను, ఎంతఘోరవనవా సము సంభవించినను, ఎట్టియిక్కట్టులు సంప్రాప్తములైనను శ్రీరాఘవేశ్వర నామ సంస్మరణముతో, శ్రీరామచంద్రపాద

సంసేవనాపారవశ్యముతో జీవయాత్ర నిఁక నెడలఁబుచ్చుటకు సంసిద్ధను. కాని, మఱఁదీ! నాకర్మపరిపాకమునుఁగూర్చి, నాజన్మానుభవకష్టములనుగూర్చి కనినందులకుఁ దల్లితండ్రులకును, కట్టుకొనినందులకు భర్తకును, మీదుమిక్కిలి సంటుకొనినందులకు మీకును జన్మములు దుఃఖభాజనము లైపోయెనుకదాయని చింతిల్లుచున్నదానను. ఇందరిజీవయాత్రలు నిరంతరదుఃఖభాజనములై, నిష్ప్రయోజనము లైపోవుటకుఁ గారకురాలనైన నేనింక బ్రతికిమాత్ర మేమిసౌభాగ్యములఁ బడయుదును? "జానకీ! నీవుపతివిదూరవగుటకు గతం బేమి?" యని మునిపత్నులు నన్నడుగుచో నాయసువు లెట్లుండు నయ్యా? అక్కటకటా! యీలోకాపవాదమునుఁగూర్చి నన్ను బరిత్యజింపఁదలంచిన నానాథుఁడు తనకడసారిముచ్చటల జెప్పియైన న్యాయముగా శాసింపరాదా? అంతటిభాగ్యమునకుఁ గూడ నోచనిదాననైతినా? ఆనీచాపవాదము జనియించిన నాఁడుకంటె, హృదయేశుఁడు నన్నిట్లు భాగీరథీతీరమున్యాశ్రమ నివాసనెపంబునఁ బరిత్యాగముఁ జేసిననాఁడు లోకంబులు నిక్కముగా నాచరిత్రము నెట్లుగా భావించునయ్యా?

లక్ష్మ—జానకీ! దయాసాంద్రుఁడగు రామచంద్రునకు నీపై నెంతటి ప్రేమకలదో నీయంతరాత్మయైన నెఱిఁగియుండకఁ బోలేదు. సద్వంశసంజాతుండును, సకలధర్మాధర్మవిచక్షణస్వరూపుండు కావున, లోకములందు సుశ్లోకవగు నీపైఁ గలిగిన యీ నీచాపవాదము సైరింపఁజాలక, కుటిలముగా, క్రూరముగా, ఘోరముగా, నిన్ను భంగించి బాధింపనొల్లక రాఘవుఁడు శాంతముతో, సరసముతో నిన్నిట్లు శాసించియున్నవాఁడు. అమ్మా! మఱల మీ కేనాఁటికైనను మంచిదినములు రాకఁ

బోవు. నీకిప్పుడు సంభవించిన యీవనవాసమునకై చింతింప వలదు. సాధుశీలవు, సత్కులసంజాతవు, సమస్తధర్మకోవిద వగు నీ వీకష్టములకు వెఱచి యెట్టిసాహసకార్యములను చేయ వలదు. అమ్మా! కష్టములందు కాలము శాంతమునఁగడుపు టయే యుత్తమధర్మమై యున్నది. నీయందు రవ్వంతయైనను దోసము లేదు. నీచారిత్రము లోకత్రయశ్లాఘ్యమై వెలుంగకఁ బోలేదు. జానకీ! దుస్తరపతితావభారక్లేశమున తనువుపై రోయవలదు. లోకములపైఁ గినియవలదు. ఎట్టులో సంయమీంద్రులయాశ్రమభూములం గాలము వెడలఁబుచ్చుము.

సీత—లక్ష్మణా! యిఁక దుఃఖము మఱువకమాత్రము చేయునదేమి? లోకములందు సతిపై జనియించిన నీచాపవాదము మిథ్యాభూత మని యెఱింగిన వారలయ్యును, నిజకులోద్ధారకులై, నిఖిల భువనరక్షణకారకులై, పత్నినైనను పరిత్యాగము చేసిన ధీరత్వము రఘుకులంబున శ్రీ రాఘువేశ్వరునకే చెల్లెను. కాని యన్యులకుఁ దగనే! మఱఁదీ! నానాథునకు నాయీవచనములఁ బల్కుము:—"మనోహరా! రూపములే దూరము లాయెనుగాని మన యంతరాత్మలకును, అనురాగములకును దూరమేమికలదు? మీకుశలమే నాకుశలము. నే నెందున్నను, మీయందలి భక్తిచే, మీపైఁగల ప్రేమచే, మీపావన నామసంకీర్తనంబుననేఁ మీచరణకమలధ్యాన విలాసంబుననే, మీపుణ్యచారిత్ర స్తోత్రంబుననే యీజీవయాత్ర వెడలఁబుచ్చెదను. రఘుకులోద్ధరణంబునకునై, రాజకులధర్మరక్షణంబునకునై, సాహసించి పత్నీత్యాగముఁ జేసిన మహాభాగ్యము మీవంటి ప్రాకృతపూరుషులకే తగెను కాని, నాథా! జగములకుఁ గలదా? మేలు. మేలు. మంచివ్రతంబుం బట్టితిరి. ఇట్టి

వీరవ్రతాచారబద్ధులరనికదా లోకంబులు మిమ్ము వేనోళ్ళ శ్లాఘించుట! ప్రాణేశ్వరా! నన్నుఁగూర్చికదా మీజన్మము కూడ దుఃఖభాజనమని చింతిల్లుచున్నదానను. మనోహరా! మీపావనకులంబునకు, మీసద్యశోలహరీవిలాసంబునకు, మీలోకమయత్వమునకు భంగములు వాటిల్లకుండిన చాలు. నే నీయరణ్యవాసమైన నమందానందంబుతోఁ గడపుదానను. కలనైనఁగాని నాపైఁగల మీకరుణావిలోకనములు, కారుణ్యభావముల నన్యథాఁ "దొలంగింపకుఁడు." మఱఁదీ! నన్ను విడనాడినందులకు నీయన్నగారు నాపై బెంగగొని నానాఁటికిఁ గృశియింతురేమో, యెట్టులైన నేమఱక క్షణక్షణము కనిపెట్టుకొనియుండి శాంతభావముతో, సరసభాషణముతో, చింతలనుబాపుచు, సంతసముఁ గూర్చుచు భద్రముగ నుండుము. ప్రప్రథమమునుండియు నాకష్టములకు నేనే కారకురాలనై యున్నదానను. సర్వము భరియించెదను. ఆర్యపుత్రుని కుశలము, అయోధ్యాకుశలము, మఱఁదీ! నాకెట్టులైనను దెలియఁజేయుచుండుఁడు.

లక్ష్మ—మేలు. మేలు. వీరపతివ్రతాశిరోమణీ! దైవ మనుకూలించుఁగాక! ప్రాణేశ్వరుఁడే నీకు భద్రసంధాయకుఁడు, పాపసంహారకుఁడు. ప్రాణవిభుచరణధ్యానమే—ప్రాణపతినామసంకీర్తనమే—ప్రాణనాయకసంసేవనమే పత్ని కిహపరసుఖప్రాప్తిహేతువులు. అమ్మా! జానకీ! కష్టములు భరియింపఁజాలక కలనైనఁగాని శ్రీరామచంద్రుని నిందింపవలదుసుమీ! రాఘవేంద్రుఁడు నీయం దనాదరదృష్టితో, అకారుణ్యభావముతోనున్నవాఁడు కాడు. తల్లీ! నిష్కరుణుండనై నిన్నీ భీకరారణ్యభూముల కప్పజెప్పినమహాపాతకుఁడను. వెళ్ళుటకు

సెలవడుగుచుంటిని. (కొంచెమాగి) అక్కటా! యీఘో రారణ్యమందీయమ నెవరికర్పగించి పోవుదును? దిక్కుమాలిన యీజనకపుత్రినిఁ గాపాడుకరుణాలోకనస్వభావు లెవ్వరుకలరు? ఓ సర్వదిక్పాలురలారా! ఓ సిద్ధవిద్యాధరయక్షగరుడగంధర్వులారా! ఓ తపోధనులారా! నిరాధారమై, నిర్భరగర్భిణియై, నిస్తులశీలయై యీవనసీమ నివసింపవచ్చిన యీపతివ్రతాశిరోమణి, యీపావన చరిత్ర యీభవ్యగుణశీల యెవరను కొంటిరో?

మ. జనకక్ష్మాపతి యజ్ఞవేదికను భాస్వల్లక్ష్మియైపుట్టి, దు
ర్జనసంహారుఁడు రామచంద్రునకు భార్యారత్నమైయొప్పి, రా
వణముఖ్యాసురమిత్తియై తనరె, శుభ్రఖ్యాతయీసీత, తా
వనవాసంబును చేయవచ్చె పతిబంపన్ దుర్యశోహానికై.

ఈయుభయకులవర్ధిని, యీయుత్ఫుల్లసరోజనేత్రి మీకరుణాపన్నతకును — మీగారవాదరణమునకును పాత్రురాలు. తల్లీ! వనదేవతా! మిథ్యాప్రసంగంబుఁగూర్చి శ్రీరామచంద్రుఁడు పంప నీయందు వసియింపవచ్చిన యీసర్వలోకైకమాతను, సమస్తసద్గుణోపేతను, యీసీత నెట్లు కాపాడుదానవో? ఏరీతిఁ గరుణించుదానవో? అమ్మా! జానకీ! ఆజ్ఞనొసంగుము. వెళ్లుదును.

సీత — సౌమిత్రి!

ఆ వె. సీత కాపురంబు ॥ చెడిపోవనే లేదు
దాశరథుని ప్రేమ ॥ తరుగ లేదు
మఱఁది! దుఃఖమంత ॥ మఱువనే మఱదిది
సర్వసౌఖ్యములను ॥ జఱుఁగు కరణి.

ఆర్యపుత్రుని కుశలముమాత్రము, మఱదీ! మఱువవలదుసుమా!
నాయనా! వెళ్లుము.

లక్ష్మ—(కొంతదూరము నడచి తిరిగివచ్చి) దైవమా! యీసింహచూలాల నీఘోరకాంతారభూముల నెట్లు విడచిపోవుదును? (జానకినుద్దేశించి) తల్లీ! జానకీ! ఏనాఁటికైన నీరఘుకులవిస్తారంబునకు నీవే కారకురాలవై యున్నదానవు. ఇక్కట్టులు భరియింపఁజాలక భ్రూణహత్యకుమాత్రము సాహసింపవలదు. అంతర్యపేర్ముఁడై నిందచూలాలలైనను రాఘవేంద్రుఁడు నిన్ను శాసించెఁబో మతివిహీనుఁడనై, నిష్కరుణుండనై నేనుకదా తోడ్కొనివచ్చి నిన్నికీకారణ్యములపాలొనరించిన మహాపాతకుండను. అమ్మా! నాపాపముల కింకఁ బార మేమికలదు? మహాఘాతుకకార్యసాహసుండనై, మహేమండలవిదూషితుండనై మఱల నెట్టు లయోధ్యకేగి మాయన్నగారి మొగముఁ జూడఁగలనమ్మా! గురులకును, తల్లులకును, జనకులకును, పౌరులకును నేనేగి యెఱింగింపఁదగినశుభము లేమిగలవు? "ప్రసూతిదినములు నిండినసీతను నట్టడవిఁ ద్రోడించి వచ్చిన లక్ష్మణుఁడే యీ కాపురమునకు ఘాతుకుఁ"డని నన్నెందఱెన్నివిధముల నిందింపకుందురు? రాఘవాజ్ఞాబద్ధుఁడనై మఱలిపోవుదునా! నిన్నుతలంచుకొనునెడ జానకీ! నాచిత్తమత్యంతచింతాయత్తమగుచున్నది. నామహాపాతకమే నన్ను బాధించుచున్నది. నాజీవితమే యొకవ్యర్థముగాఁ దోచుచున్నది. జానకీ! కాననంబుల నీరక్షణకై నీసపర్యలయందుఁ దగిలి నిలచియుందునా? నిర్హేతుకముగా నింతయసాధారణవార్త జనియించినలోకంబులం దప్పుడు మాత్ర మెంతెంతలు బయలువెడలకుండును? ఏమికీళ్లు మూరకుండును? ఏమిసేయుటకు

ను తోచకున్నది. ఎట్టుపోవుటకును కాళ్ళురాకున్నవి. దైవమా! యీయధమాధముఁనింక యేలబ్రతికించెదవు? ఈమహాపాపకార్యములకు శిక్షలే లేవా? ఈమహాపాతకున కంతమే లేదా? ఓకరుణామయా! వలదయకలుగదు? ఎందులకు మామొఱలాలింపవు? అమ్మా! వైదేహీ!—

సీత—(ధైర్యముతో) సౌమిత్రీ! ఎట్టులో మనసు రాయిఁజేసికొంటిని. మఱల నాకు దుఃఖ మేలకలుఁగఁజేసెదవు? ఈజన్మానుభవకష్టముల నే నిఁక ననుభవింపకతీరవు. నీవేలచింతించెదవు? కర్మపరిపాకమట్టిదాయెను. కాని, కోరుకొనుటకు వేఱుకోరికలు లేకయేనా నేను నాప్రియుని, వలదన్నను వనవాసమే కోరితిని! అన్నియు నిట్లు కలసివచ్చినవి. కావుననే నాకాపురమున కిప్పు డిన్నికడగండ్లు సంభవించినవి. ఆనాఁ డామాయలేడిని గూర్చి యసురునిపాలైతిని. ఈనాఁ డీమునికన్యకాస్నేహాసంచారవాంఛితంబునుఁగూర్చి యడవులపాలైతిని. ఈకష్టములకు నేనెంతమాత్రముచింతింపను. కాని, మఱఁది! మాయామానుషవిగ్రహులు కానలోకమాయఁదవిలి లోకంబులవలెనే యార్యపుత్రుఁడుకూడ నాచారిత్రము కళంకభూతమే యని విశ్వసించుచో నప్పుడేమియుపద్రవములు వాటిల్లునో యని భీతిల్లుచుంటిని. అన్నిటికిని దైవమేకలఁడు. లక్ష్మణా! ఎప్పటికిని నీవు మీయన్నగారినిమాత్రము విడచియుండవలదు. ఆర్యపుత్రుని క్షేమమునకు నిన్ను మిక్కిలి విశ్వసించియుంటిని. గురువులకును, అత్తలకును, జనకులకును నావందనములని వచియింపుము. ఆర్యపుత్రునితో,

సీ. జనకుని సభయందు । సాంబుని విల్లుఁద్రుంచె,
నరయంగనాయీసీత । కొఱకె యనుము,

దండకాటవియందు । దైత్యసంతతిఁ గూల్చెఁ
గోరి యీజానకిం । గూర్చియనుము
కపిరాజుతో స్నేహ । గౌరవ మేపారెఁ
బ్రీతిసీత గుఱించియనుము
సేతువుబంధించి । చెండాడె రావణు
ధృతిమీఱ జానకీ।దేవి కనుము.

గీ. తారు వడియున్నశ్రమలన్ని । ధరణిలోన
సొరిదిఁదలఁప నీధారుణీ।సుత కె యనుము
రూపములు దూరములుగాని । దాపుమాకు
నంతరాత్మలు ప్రణయయు।క్తంబులనుము.

"సీత కాపురమున కింతటిచేటు చేకూఱెనని" నిర్భరవిషాదనిమగ్నులను, విదేహదేశాధీశులునగుజనకచక్రవర్తికి నానమస్కృతులఁబలుకుము. ఈలోకాపవాదమునుగూర్చి నాచారిత్రము సంశయాస్పదమగుటచేఁ బతివిదూరనైతినని నాతండ్రిగారెఱుంగుచో నెట్లుగా భావింతురో? ఏవిధంబున సంశయింతురో? బాల్యమునుండి పెంచి పెద్దదాననుగాఁ జేసిననాతండ్రి నాసౌశీల్య మెఱుఁగకుందురే? క్షాత్రధర్మముచేఁ బరిత్యజించిరిగాక; ఆర్యపుత్రులకుమాత్రము తెలియకుండునా? కర్మపరిపాకమునుగూర్చి వాటిల్లినయీకష్టములకై యిఁక నంతగాఁ జింతించుటతగదు. నామఃప్పూరచెలియండ్ర నడిఁగితిననుము. మఱిఁదీ! ప్రొద్దుగుంకుసమయ మగుచున్నది.

మ. తనవంశోద్భవులౌ రఘూపతి కళ।త్రప్రాప్త కష్టంబులన్
గని సైరింపక, మేలుచేయునది లే।కన్ వ్యోమమార్గంబునం
దున నిల్వంబనిలేదనంగను మహా।ర్తుంబోలె ఖిన్నాత్ముఁడై
యినుఁ డాపశ్చిమసంద్రమందు మునిఁగెన్ । హీనప్రభాజాలుఁడై.

అంతకంతకు చీఁకట్లుగ్రమ్ముచో మార్గమైనఁ గానరాదు. కానున్న దంతయుఁ గాలవశమున సంపూర్తియైనది. మీయన్నగారు నీ రాకకై నిరీక్షించుచుందురు. ఆవలియొడ్డున సుమంత్రుఁ డెదు రుచూచుచుండును. మఱఁది! ధైర్య మవలంబించి యిఁక నే నేదోయొకదారిఁ జూచుకొనియెదను. నీవు పొమ్ము.

లక్ష్మ—మేలు మేలు. వీరపతివ్రతాశిరోమణీ! నానమస్కృతుల గ్రహింపుము. (అని నమస్కరించును.)

జానకీ!

మ. మునికాంతాప్రకరంబుతోడ సరసంబుల్గోష్ఠివర్తింపుచుఁ
ఘనలీలా దివ్యమునీంద్రసేవలను వేడ్కంబూని, యశ్రాంత మా
యినవంశోత్తమకీర్తనంబున లతాంగీ! కాలముం బుచ్చుమా,
జనముల్ నిన్నుఁ గంగొంగునపుడే సంప్రాప్తముల్ శ్రేయముల్.

(అని లక్ష్మణుఁడు నిష్క్రమించును.)

సీత—(దుఃఖముతో) అకటకటా! ఏమికాలము సంప్రాప్తమైనది? ఒకమిథ్యాప్రవాదమునుఁ గూర్చి నానాథుఁడే న న్నొల్లకుండినప్పుడు నాకింక నీ జన్మయేల? మనోహరా! ఏ జన్మయం దేమిపాపముఁ జేసికొనియుంటినో, ఏనాఁ డేననోచుకొనినోము లెట్టివో, తత్ఫలంబు లన్నియు నా కిప్పుడే యనుభావ్యము లగుచున్నవి. లేకపోయిన లోకములం దింత పాపము బ్రద్దలగుటకు కారణ మేమికలదు? ఆర్తజనబాంధవులే, అపరిమితానురాగమానసులే, నాచారిత్రము కళంకభరితమైనదని నాథా! పరిహాసమునకైన నొకనాఁడును నుడువరైతిరేమి? పత్నీపరిత్యాగవాంఛ వొడముటకు మనోహరా! మిమ్ముల నొకనాడును నేను కష్టపెట్టి యుండలేదుకదా! పుట్టినిల్లుతలఁచిన పూజ్యమైనబలగమే, మెట్టినిల్లు విచారించిన

సకలశోభనసంభృతమే, సమస్తసామ్రాజ్య లక్ష్మీవిభవమే, త్రిభువనరక్షాదక్షులు, దేవదేవేశ్వరులైనమీవంటివారు భర్తలే, అయ్యో! నాదౌర్భాగ్యవిశేష మట్టిది. కాని యేమి తక్కువకలదు? ఇన్నియుండియు నాజీవిత మెంతనిరర్థకమైనది? తప్పనిసరి యగుటచే లక్ష్మణునితో యేమేమొ ధైర్యవచనములఁ బల్కితిని. కాని దైవమా! యిప్పు డేమిచేయుదును? ఈకీకారణ్యమున నారోదనము విని యాదరించువా రెవ్వరు? ఎవ్వరు?

(తెఱలో)

జానకీ! సర్వజగద్రక్షకుఁడే సంరక్షకుఁడు, భయమువలదు.

సీత—(దిశలు పరికించి ఆశ్చర్యముతో) ఏమి! ఈ యార్తరక్షావాక్యమేమహాభాగునిదై యుండును? ఈయాశ్రమభూమి యేమహాత్మునిదై యున్నదో? ఈదీనురాల నిప్పుడు రక్షించు పుణ్యాత్ము లెవరుకలరు?

[శిష్యునితో వాల్మీకి ప్రవేశించును.]

శిష్యు—గురూత్తమా! యీసాధుశీలయేనా శ్రీరామచంద్రుని యిల్లాలు! ఇంతకుమున్ను మనము వినిన దీనారవ మీయమదే కాఁబోలు!

వాల్మీ—అగునగు! (అని సీతవంకఁ జూచి) అమ్మా! జానకీ! కాలవశమునఁ గలిగెడు కష్టము లనుభవింపకఁ దొలఁగవుకదా! చింతింపవలదు. సర్వజగద్రక్షకుఁడే సంరక్షకుఁడు.

సీత—తాపసేంద్రా! అభివందనము. (అని నమస్కరించి) ఆర్తురాలనగు నన్నుఁ గాపాడవచ్చిన మిమ్ముల నెఱుఁగుకొనఁదగునా?

వాల్మీ—అమ్మా! చిన్నదానవు. కాన నీవు నన్ను బాగుగా నెఱిగియుండవు.

ఉ. నాకును నీహృదీశునకు నవ్యముస్నేహము, యోగదృష్టిచే
నీకథగోచరంబు, ధరణీపతియైనను నీకుమామకున్
నాకు నపూర్వమైత్రి, యొకనాఁటికిఁగోత్రము నీదుతండ్రి? వా
ల్మీకిని, జానకీ! యిచటనేకల దాశ్రమభూమియేనియున్.

కారణాంతరము లట్టి వాయెను. కాని, కుమారీ! నీ కీకాలమునఁ గలుఁగవలసిన కడగండ్లేనా యివి? ఏనాఁటి కేమో, నింక చూలాలవు. నిర్మలరఘుకులవిస్తారంబునకుఁ గారకురాలవు కదా! అమ్మా! యీసమీపంబుననే మదాశ్రమంబు కలదు. అందు నాయింట నీకెద్దాన నెట్టిలోపములును గలుఁగవు. నిరంతర మునికన్యకాజనసంసేవ్యవై, నిస్తులరామనామసంస్మరణమానసవై, వైదేహీ! నీవు నాకడ మెలంగవమ్మా! ఏనాఁటికైనను లోకంబు లజ్ఞానరహితంబులై నీచారిత్రమును పావనంబుగా గ్రహియింపకఁబోవు.

సీత—తండ్రీ! నాయాపత్కాలము గ్రహించి మీ రింతగాఁ బల్కుచుంటిరి. కాని, యెంతకాలమని నన్ను మీరు సాకఁగొనఁ గలుఁగుదురు? అయ్యో! యిట్టి లోకాపవాదముతో నెట్టు బ్రతుకుదును? నాయనా! నీకంటె నాకిఁక నెక్కువాప్తు లెవరుకలరు? కాని, తదాశ్రమంబులజనంబులు నాచారిత్రము నెట్లు విశ్వసించెదరో? ఏమి భావించెదరో? ప్రసంగవశంబున నెప్పుడైన నొకప్పు డచ్చటి మునిపత్నులందఱు, "జానకీ! నిక్కము వక్కాణింపుము. నీభర్త నిన్నేల విడనాడె?" నని నన్నడుఁగుచో, తండ్రీ! ఉత్తమక్షత్రియకులసంజాతనే, ఉత్కృష్టధర్మమార్గాసక్తనే యేమి సమాధానమిత్తును? ఎట్లు ప్రాణములు నిల్చును?

వాల్మీ—జానకీ ! శంకింపవలదు. అనుదినము నీసపర్యలయందు నియమింపఁబడియుండు నిరువురు మునికన్యలకుఁ దక్క తదితరజనములకు నీ వదృశ్యవగునటుల వరమిచ్చితిని. బిడ్డా ! రాజభోగంబులును, రాఘవదర్శనభాగ్యంబులును శూన్యంబులు. కాని నాయాశ్రమమం దైనను నీకుఁ గొఱఁతలుండవు. అదియునుం గాక,

ఉ. పుట్టినయిండ్లు చేరుదురు । భూస్థలి కానుపుత్రి లతాంగు లే
పట్టునసైన, సాధ్వి ! రఘు।వంశము నిల్పఁగనున్న నిన్నుఁ దా
నెట్టులొ చేర్చినాఁడు విధి । యిచ్చట, కయ్యదికూడ నీ కిలన్
బుట్టినయిల్లుగా నె తల।పోయుము, త్రోయుము కాలమెట్టులో ?

సీత—నాయనా ! నాకీవికటకాలమందు నీవే రక్షకుఁడవై యున్నావు. నీ ప్రేమాదరముచే నేను పరిపూర్ణముగా నాదుఃఖమును మఱచిపోవుచున్నాను.

వాల్మీ—అమ్మా ! యీమార్గము కంటకమైనది. మిక్కిలి చీఁకటిగానున్నది. భద్రముగ రావలయును సుమా !

శిష్యు—గురూత్తమా ! ఇటు వెళ్ళుదము.

(అని యందఱు నిష్క్రమింతురు)

[తెఱపడును.]



శ్రీరస్తు.

# కుశలవ

## చతుర్థాంకము.



ప్రదేశము—రాజసౌధము

[లక్ష్మణుఁడు ప్రవేశించును]

వృషలుఁడగు శంబుకుఁడు మహద్భక్తిపరుఁడనుటకు మాత్రము సంశయము లేదు. కాని యాతని వర్తనము యుగవిరుద్ధమైనది. అదియే కదా హేతువు విప్రకుమారకుఁడకాలమృత్యువాతంబడుటకు! సంతతప్రేయసీవియోగజనితవ్యాకులమనస్కుఁడగుటచే ప్రభుఁడగు రామచంద్రుని రాజ్యమందు కూడ నిట్టి విరుద్ధములు సంభవించినవి. అగు నగు!

తే. గీ. జగములను గూర్చి పౌరుషస్వాంతుఁడగుట
రమణి నెడఁబాసెఁ గాని శ్రీరామమూర్తి
తద్వియోగదుఃఖంబు దుస్తరము తలఁప
సతులవీడిన విభులకు శ్రమలు కావె?

శంబుకవధమైనది. బ్రాహ్మణకుమారుఁడు పునర్జీవితుఁడగుటయైనది. అగ్రజుని దుఃఖోపశమనము మాత్రము కాలేదు కదా! "ఎట్టులైన నచిరకాలంబులో రామభద్రునిచే నొక యశ్వమేధంబుఁ దలపెట్టింపు"మని వాల్మీకి భగవానుఁడు నన్నుఁ బ్రోత్సాహపఱచిరి. అట్టి మహాకార్యసంధానంబున కిప్పుడే తరు

ణముగా నున్నది అన్నగారి శోకవిధమును చిత్తశాంతియుఁ జేకూఱఁగలదు గాన వేగిరమరిఁగి గురులగు వశిష్ఠులవారితో యోజించి తత్క్రతుసంకల్పమునకై ప్రయత్నించెదను.

(అని నిష్క్రమించును)

(తెఱపడును.)

(ఇది విష్కంభము)



రంగము.

ప్రదేశము — రాజసౌధము.

[రాముఁడు ప్రవేశించును]

హా! దేవీ! అపూర్వమైన యొక పామరవాక్యమునుగూర్చి, రాజధర్మం బతిభారుణం బగుటచే నీమొడ నిట్టి ఘోరనిర్ణయము సంకల్పించితినే కాని, నీచారిత్రము, నీసౌశీల్యము నెఱుఁగనివాఁడనా? నీయకాలవియోగప్రారంభమే నా కత్యంతపరితాపహేతువైనది. కొలువుకూటము వీడి యంతఃపురప్రవేశమగునప్పటికే, పెంపుఁడుచిలుకలతో, ప్రేమంపుభామలతో సకలవిధసపర్యలందించుచు, సానురాగముఁ జూపుప్రణయం పుటిల్లాలవు. దేవీ! నీవులేని యంతఃపురంబైన నా కమితో గ్రాటవిగానే తోఁచుచున్నది. వెనువెంట నీవున్నతొల్లిటిదండకారణ్యపర్ణశాలా నివాసమే, నిన్నడఁబాసిన యిప్పటి యీ యయోధ్యాపురరాజభవననివసనముకంటె దేవీ! నాకుచాల నుత్కృష్టమైనది కదా! జానకీ! ప్రాణతుల్యవగు నీవే నాకు లేనిదినములు సంభవించిన, యీ యంతఃపురంబులు ఈ యసాధారణవైభవంబులు, ఈ యఖిలసామ్రాజ్యపరిపా

లనాభోగంబులును, మీఁదుమిక్కిలి యీప్రాణంబులైననేల? "మనోహరా! రూపములే దూరములాయెను గాని, మన యంతరాత్మలకును, అనురాగములకును దూరములే" దని కదా మఱంది సౌమిత్రితో నాకు కబురంపితివి! ముగ్ధహృదయా! యీదౌర్భాగ్యుని యంతరాత్మ యనురాగరహితమే యని యిప్పటికైన నెఱుఁగఁగొనవైతి వేల? అనురాగలేశ ముండుచోఁ గానితరుణమున నీకిట్టి కడగండ్లు గూర్తునా? వంశద్వయోద్ధారకురాలవగుట దేవీ! నీ వెందున్నను నిరంతరప్రాణేశ్వరనామ సంస్మరణంబుతోడనే నీజీవయాత్రఁ గడుపుదు వనుటకుమాత్రము సందియంబు లేదు. హా! సఖి- నీవు సాకిన శారికామిథునంబులు, నీకలవాటై నీపల్కులనేర్చిన కీరసంతానంబులు, నీవుపరుఁడి పావనములు గావించిన యంతఃపురహంసతూలికా శయ్యాతలంబులు, నీవు సౌఖ్యమందిన యావివిధమణిరత్నఖచితబంగరుటూయెలలు, నీవు ధరియించిన యమూల్యచీనిచీనాంబరంబులు, నీవు సంచరించిన యీప్రదేశంబులు, నీవు పెంచిన సుందరోద్యానవివిధపరిమళప్రసూనభరితలతావితానంబులు, వెయ్యేల? నీ కనుభావ్యములైన సమస్తవస్తునిచయంబుఁ బరికించుచున్న దేవీ! నాహృదయము అంపఁపుఁగోతగా నున్నది. కనులుమూసినను, తెఱచిననేమి నిన్నుఁబాసినది మొదలు నీదివ్యవిగ్రహసాక్షాత్కారభ్రాంతియేగాని నాకితరంబు లేదు. కాన్పుకాలంబునకు గరితల నెట్టివారలు పుట్టినిండ్లఁజేర్చుదురుగాని, నావలె దయారహితులై కాఱడవుల నుండఁ బంపరుకదా! ఓపలేనిపరిస్థితికదా! దేవీ! దిక్కుమాలినదాననై యాయుగ్రారణ్యమధ్యప్రదేశములం దెంతయఱ

వస్థ నందుచుంటివో? ఏవిధంబునఁ గుందుచుంటివో? ఎట్టి ధైర్యంబు వహించియుంటివో?

సీ. మృగరాజవ్యాఘ్ర మ।దేభవాసఁపుసీమ
యుద్యానభూమియే । యువిద! నీకు?
కఠినశిలాజాల।కంటకంబగు నేల
పూవులపాన్పయే । పొలఁతి! నీకు?
క్రూరజంతువిహార।నీరపూరంబులు
జలకమాడెడుచోట్లు । సఖియ! నీకు?
శ్రవణకఠోరఘో।రమృగారవంబులు
సరసతూర్యంబులే । తరుణి! నీకు?

తే. గీ. లభ్యమగు కందమూలఫ।లాదులచట
దివ్యభుక్తి పదార్థమే । తెలివ! నీకు?
అడవులం దఁజరించు భి।ల్లాంగనలును
రమ్యపుంజెలికత్తెలే । రమణి! నీకు.

జానకీ! కనినప్పటినుండి తల్లిదండ్రు లెంత గారామునఁ బెంచిరో, కట్టుకొనినప్పటినుండి మగఁడు నీకంతకంత కష్టములనే కూర్చినాఁడు. వేయిజన్మములకైన నేమి, దేవీ! నావంటినిర్భాగ్యుని దాంపత్యము మాత్రి మీఁక నాశింపకు.

తే. గీ. లేకలేక గర్భంబుఁ దా।ల్చితివి దేవి!
యీరఘుకులాన కంకుర । మేర్పడునని
యెల్లగును మనస్స్ఫూర్తి నా।శించినారు,
కర్మపరిపాక మటులొటఁ । గలిగెక్రియలు,
పృథివిఁ "జెడుకాలమున నె విప।రీతబుద్ధి."

హా! సీతా! సుగుణసమేతా!—

[లక్ష్మణుఁడు ప్రవేశించి]

(తనలో) అగ్రజుఁడు సీతావియోగ పరితాపాయత్తచిత్తుఁడై యున్న వాఁడు. అంతులకేఁగదా జీవితేశునిహృదయము మెఱింగిన మా వదినెగారు, "మీయన్నగారు నాపైఁ బెంగఁగొందురు. ఎట్టు లైన నేమఱక క్షణక్షణముఁ గనిపెట్టుకొని యుండు" మనిపలు మాఱులు నన్ను శాసించినది! ఇప్పుడీ చింతనుండి వీరిహృద యము నన్యాలోచనకు మరల్పవలయును. (ప్రకాశముగా) అగ్రజా! క్షాత్రశౌర్యసంపన్నులగు మీవంటి కిట్టి యధై ర్యంబు తగదు. పతివ్రతాతిలకమగుటచే సీతాసతి యెందున్న ననంతశుభంబులనే బడయును. ఊఱడిల్లుఁడు.

రాము—సౌమిత్రీ! యీమహాపాతకునిజన్మంబున కింక నూఱట కూడకలదా? జానకీచరితము సకలభువనస్తవనీయమే! ఆ సాధ్వి పాతివ్రత్యమైన జగత్త్రయవిశదమే! ఆముగ్ధరాలకైన కష్టంబు లాజన్మానుభవ సిద్ధంబులైనవి. ఆనారీమణి దాంప త్యవైభవంబుచే పాపభూయిష్ఠమైన నాజన్మము కొంతవఱకు సఫలతనే గాంచినదిగాని, లక్ష్మణా! నామూలముననేకదా కళ్యాణమైనదాది యాజన్మాంత మగణ్యంబులైన యగచాట్లు సతీతిలకంబునకు ప్రాప్తంబులైనవి. ఇంతకు హేతుభూతుఁడ నగు నాకీజీవనంబులపైనైన నింక భ్రాంతి యంతరించినది. ఈరాజ్యమైన వలదు. నేనుకూడ గంగాభూములకే చని యీ యసువులఁ బరిత్యజించెదను.

లక్ష్మ—శ్రీరామచంద్రా! ప్రాకృతపూరుషుండవు. జగంబులు నీయందు లీనమైయున్నవి. సృష్టిస్థితిలయంబులకుఁ గారణుం డవు. ఐహికసౌఖ్యకష్టంబులు సమంబులు, క్షణభంగురంబు లని యెఱింగిన ప్రాజ్ఞులైన మీఱలే యొకయత్యల్పవిష

యంబుఁ గూర్చి నిరంతర పరితాపభరితమనస్కులై యధై ర్యంబు లాడుచో నింక జగంబులేమి ? గతించిన దానికైఁ జింతించుట మహాభాగలక్షణము కాదు. పూజ్యులగు వశిష్ఠు లవారేఁగుదెరిరి.

[వశిష్ఠుఁడు ప్రవేశింప రామలక్ష్మణులు పీఠమొసంగి నమస్కరింతురు]

తే. గీ. అస్థిరంబగు జగముపై । నాశఁదవిలి
మాయలోఁ జిక్కి కుందెదు । మర్త్యులట్టు
లోక సతీవియోగముచేత । వికలులగుచు
నిత్యమును మీరె యింత చింతింపఁ దగునె ?

రఘుకుల ప్రదీపా ! తగదు తగదు. లోకంబులకు నీవే నాథుండవు. మాయామానుషవిగ్రహుండవై కష్టసుఖంబు లందుచుంటివే గాని సర్వంబు నీ యందెకలదు. శాంతివహింపుము. రఘు వంశోద్భవ ప్రభుసంతానమంతయుఁ బెద్దకాలంబునకు యాగం బు లొనరించి పేరు వహించెను. నరేంద్రాగ్రణీ ! మీరలు కూడ ప్రాచీనాచారక్రమంబుగా, దశకంధర వధాపాదిత బ్రహ్మహత్యాదోషనివారణంబునకై యొకయశ్వమేధంబుఁ గావింపుఁడు. శుభంబు లందుదురు.

లక్ష్మ—మహాత్మా ! గురూత్తముని హితము లాలింపఁదగినవి. వీరకు లోద్భవులగు సూర్యాన్వయనృపతు లశ్వమేధంబు లొనరించి దిగంతవిశ్రాంతయశంబులఁ గడించిరి. మీరలైన నామార్గ మును దప్పవలదు.

రామ—ఏమి ?—ఏమందురు ? అశ్వమేధమా ? సీతాలతాంగీవి యోగంబుచే నిర్భాగ్యుఁడగు నీరాముఁ డపత్నీకుఁడగుట మఱువరుకదా ! భార్యావిహీనునకు యాగార్హత లుండవని వేదంబులు సెప్పుచుండును.

లక్ష్మ—అగ్రజా! యాగార్హ్వతలుండుచోఁ దత్సంకల్పము మనకు శుభదాయకమైయున్నది.

వశి—నృపాగ్రణీ! సందేహంబువలదు. సువర్ణసతీవిగ్రహనిర్మాణ ప్రధానమాత్రంబుచే నపత్నీకుఁడైన నేమి, సర్వయాగనిర్వహణార్హుఁడగునట్లు శ్రుతులే సమ్మతించుచున్నవి. ప్రస్తుతము మీ కట్టిన నట్టియాధారంబుననే హయమేధ మొందు ప్రారంభించుఁడు.

లక్ష్మ—అగ్రజా! శుభకార్యంబుల కంతరాయంబులు కలుఁగవు. మీకెద్దానసైన నెట్టి కొఱంతలులేవు. లోకవిజయులమగు తమ్ములము గలము. మహాభ్యుదయాగంబు లొనరించినను సుంతైన తఱుఁగని ధనంబుగలదు. అతిధైర్యసాహసధురంధరులును, అరిసంతానసంహారక నిపుణులును, ఆహవరంగాక్షీణ పరాక్రమవంతులునగు వీరభటులైన నెందఱెందరో కలరు. హయమేధంబనిన మీకెంతేని యాగభాగంబులకు దేవత లరుదెంతురు. సకలమునికోటిసందర్శనంబును, సమస్తవీరక్షత్రియజాతసామంతవంబును, శ్లాఘ్యమహాదానధర్మవిశేషంబులును, సర్వక్షితీసురాఖండాశీర్వచనమహాఫలితంబులును, సంస్తుత్యాఖిలభూతజాలసంతృప్తిభాగ్యంబులును మీకు సంభవంబులు. "సతీవియోగుఁడయ్యును సకలజగచ్ఛ్లాఘ్యముగ శ్రీరాముఁ డశ్వమేధంబుఁ గావించె"నని లోకంబులు కీర్తించుచో, మీ కులకామినీమణిభాగ్యంబు యోగ్యాబగుట యట్లుండ, యాపవిత్రభాస్కరకుల బునకునైన నాకల్పాంతశోభలును, అత్యంతాపూర్వగౌరవంబులును సిద్ధంబులు. ప్రాచీనగురులగు నీవశిష్ఠభగవానునివాక్యములు తొల్లి మనతండ్రియుంతటివాఁడె త్రోసివేయకఁ బాటించి శుభంబులందిరిగావ,

మీరలుకూడ వారి యుపదేశములనవశ్యాచరణీయములుగ భావించి యశ్వమేధంబు సంకల్పింపుఁడు. శ్రేయంబగును.

రాము—గురూత్తమా! రావణవధచేఁ గలిఁగినపాతక మంతరించుటకు తురఁగమేధంబు చేయవలయునని నాకు చాలకాలమునుండి కుతూహలముగలదు. కాని జనకసుతావియోగమే దానికంతరాయమై నన్ను దుస్తరదుఃఖాబ్ధి ముంచుటచే నామానస మన్యథా చలియించినది. మఱల మీరలు నాకిప్పు డట్టి యుత్సాహము నే కలిఁగించుచుంటిరి. తమ్ముఁడగు లక్ష్మణునకుఁ గూడ మంచి వేడుక కలదు. ఏమియైనఁగానిండు. అశ్వమేధంబు సంకల్పించెద. విధానం బెఱింగింపుఁడు.

లక్ష్మ—అగ్రజా! మంచిది. మీకట్టి యుత్సాహము కలుఁగుట మనకు శ్రేయోదాయకమే! (వశిష్ఠునిఁ జూచి) గురూత్తమా! వాజిమేధవిధు లెఱుంగఁ జేయుఁడు.

వశి—రాఘవేంద్రా! సరయూనది కుత్తరభాగంబున విశాలమగు యజ్ఞశాల నిర్మింపుఁడు. యాగశాలా మధ్యభాగంబున హోమగుండం బుండవలయును. సద్వంశసంజాతులును, సకలసత్కర్మానుష్ఠాననిరతులునగు సహస్రబ్రాహ్మణులు ఋత్విజులు కావలయును. సమస్తవిధదానంబులచే వారలఁ దృప్తిబఱపవలయును. ఈ యాగంబున కశ్వమే ప్రధానమైనది. స్నిగ్ధమై పాండురచ్ఛాయశరీరంబును, శోణశిరోధియు, శ్యామలంబులైన కర్ణంబులు, పసిఁడివన్నెచే నొప్పు దీర్ఘపుచ్ఛంబును గలిగినతురంగంబును నానావిధనూత్నరత్నభూషణములచే నలంకరించి మృగమదగంధమాల్యాదులచే నర్చించి, బిరుదపట్టంబొందు లలాటభాగంబునఁ గూర్చి, సర్వసర్వంసహాచక్రమంతయుఁ దిరుగఁ బంపి, భుజబలశాలులగు వార

లనుత్రదక్షిణంబున నై వెళ వెంట నంపవలయును. ఆయజ్ఞీయా శ్వము చిక్కువడునెడల యాగభంగమగును. దేవా! యింత యు సిద్ధముఁ జేయింపుఁడు.

రాము—గురువరా! అన్నియు సిద్ధములు జేయించెదను. ఎట్టులైన నీ యాగ మవిఘ్నముగ నెఱవేర్పుఁడు.

లక్ష్మ—రఘుకులేంద్రా! బంధువులెల్లరకు మీం దీశుభ కార్యముఁ దెలియఁబఱచి పిలువనంపుఁడు. అదిగో మనభరతశత్రుఘ్నులు కూడ వచ్చుచుండిరి.

(భరత, శత్రుఘ్నులు ప్రవేశింతురు.)

భర—అన్నగారు దీర్ఘాలోచనా నిమగ్నులై యుండిరి.

శత్రు—జానకీదేవివియోగమప్పటినుండియు నగ్రజునిచిత్త మత్యంత చింతాకులముగ నున్నదికదా!

వశి—అజ్ఞులకది సహజమే గాని శ్రీరామచంద్రుఁడు పురాణపూరుషుఁడగుట ప్రేయసీవియోగమైన నంతగా బాధింపదు.

రాము—తమ్ములారా! తగిననమయమునకు మీర లరుదెంచితిరి.

తే. గీ. అసురహతిదశాననుని సంహారమునను
సంభవించినపాతకాంతి కొఱకు
రఘుకులాచారమునకు దూరంబుఁ గాక
యశ్వమేధంబుఁ దలపెట్టి నాఁడ నిపుడు.

భర-శత్రు—జయము. జయము. లోకప్రభువగు మీరు తలంచెడు శోభనకార్యంబుల కభ్యంతరంబులున్న వే? అవశ్యము కావిండు.

రాము—తమ్ములారా! అంతయు మీసాహాయ్యముననే సానుకూలము గావలయును. భరతా! బంధుగులఁ బిల్చుకొనివచ్చుటకు నిన్ను నియమించెదను.

భర—దేవా! అటులనే మీయాజ్ఞ శిరసావహింతును.

రాము—శత్రుఘ్నా! నవనహయరక్షణమునకై ముందు నీవరుగుము.

శత్రు—అగ్రజా! అట్లనే వెళ్ళెదను.

రాము—తమ్ముఁడా! భద్రకుసుమా! త్వరపడి హింసలొనర్చి పాతక మార్జించుటకూడదు. లక్ష్మణా! తక్కిన కార్యభారమంతయు నీయదియే! పూజ్యులగుమామగారుమిథిలాపతి కీవర్తమానముఁ దెలియఁబఱచి వారలఁ దోడ్కొని రాఁగలసమర్థుఁడవు నీవే!

తే. గీ. గర్భిణీస్త్రీని దయ లేకఁ ¦ గాన కంపె
రామునకు వాజిమేధంబిఁ ¦ కే మియునునో?
కన్నబిడ్డయే లేనిపక్షుంబునందు
మీమఖంబులకేఁగ మా ¦ కేమియునునో?

ఎట్టులైన నాజనకపతిని మనయజ్ఞమునకుఁ దీసుకొనివత్తువేని ధన్యులమగుదుము. యాగఫలంబు దక్కును.

లక్ష్మ—దేవా! అనునయవాక్యములతో మామగారైన జనకచక్రవర్తి నోదార్చి యెట్టులైన మనయజ్ఞంబునకుఁ గొనివచ్చెదను.

వశి—నరేంద్రా! సీతకొఱకుఁడగు మిథిలేశుఁడైనను మిమ్మొఱుంగనివాఁడు కాడు. ఈశుభవర్తమానము వినినవెంటనే ప్రయాణమై వచ్చును. సంశయింపకుఁడు.

రాము—తమ్ములారా! యింక మీరు మీపనులయందుండుఁడు. సవనంబునకుఁ దదితరయత్నంబుల నేను జేయించెదను. (వశిష్ఠుఁ జూచి) గురూత్తమా! ఇప్పుడు జఱుఁగవలసినదేమి?

వశి—యజ్ఞాశ్వమును విచారించుటయే కర్తవ్యము.

రాము—అట్టి లక్షణములుగల హయములు దొరకుటయే కష్టతరముగాఁ బోలు! ఈవిషయమై సుమంత్రుని యోజింతము. వెళ్ళుదము రండు.

(అని యందఱు నిష్క్రమింతురు.)

[తెఱపడును.]



శ్రీరస్తు.

# కుశలవ

## పంచమాంకము.



ప్రదేశము—అరణ్యము.

[నిమి, లవుఁడు ప్రవేశింతురు.]

నిమి—లవకుమారా! ఏమి? ఆహాయలలాటమందలి పద్యమును మరలనొకసారి వినిపింపుము?

లవు—నిమీ! పద్యము చదువుచున్నకొలఁది వీరరస మధికమగుచున్నది. వినుము.

ఉ. వీరకులోద్భవుండు రఘువీరుఁడు బంపిన సత్రవాజి, నె
వ్వారలెయైన ధీరు లిలపైఁగలుగంగను బట్టవచ్చు, దు
ర్వారపరాక్రమోద్ధతులు రాముని తమ్ములె దీనిరక్షకుల్
పోరుల వెన్కఁబోక నొకపోటున నె గూల్చెద రెల్లలోకముల్.

ఔరా! ఎంతనిరంకుశముగనున్నది! రఘుకులంబు వీరకులంబఁట! రాముఁడు ధీరాగ్రేసరుఁడఁట! వారియజ్ఞహయంబఁట! ధీరులుండిన బట్టవచ్చునఁట! ఏమేమీ! వారితమ్ములు దుర్వారపరాక్రమోద్ధతులఁట! క్రతుతురంగసంరక్షకులఁట! వారలయెదుట నింకజగంబులే లేవఁట! మునికుమారా! శౌర్యమాపాదమస్తకమునన్నావరించినది. తొల్లి జగములం దశ్వమేధంబులు చేసియశంబుల గడించిన నరేంద్రు లెందఱెందఱెంతెంతవారలు లేరు. ఈవిధంబున బీరంబులాడియుందురే? ఆరాముని తల్లి దక్క

లోకంబున వీరమాతలే లేరు కాఁబోలు! ఆరామునితమ్ములే గాని తదన్యు లీజగంబుల పరాక్రమంబులే యెఱుఁగరు కాఁబోలు! ఔరా! ఏమిరాముఁడు! ఏపాటియజ్ఞము!! ఎట్టిబిరుద పట్టము!!! ఉన్మత్తవాక్యంబులా? ఉత్కృష్టవీరాన్వయసంజాతవచనంబులా ? క్షాత్రశౌర్యసంపన్నుఁడీరోషవాక్యసమితికి సైచునే? పవిత్రురాలగు నాతల్లి సీతామహాదేవి వీరమాత కాదా? ఆసాధ్విబిడ్డలము మేము వీరులము కామా? ఇదిలోకంబెఱఁగదా? ఆధీరాగ్రేసరుఁడగు రామునియాగసంరంభము, అతమ్ముని యక్షీణబలపరాక్రమసంపన్నతలు, ఆజగదేకవీరకులోద్భవులనిశ్యాత్మప్రతిభంబులు సమస్తములు జూతును గాక! మునికుమారా! ఫాలాక్షుఁడెదురైననేమి నేనింక యీహయంబును విడతునే? ఈపైనుత్తరీయంబుచే దీనినీపాదపంబునకు బంధించెదను వీరసంగ్రామంబున జయంబుఁబొందినను వన్నెయే! చచ్చినను స్వర్గమే.

(అని యశ్వమును బంధించును.)

నిమి—జానకీకుమారా! బాల్యచాపల్యమున నతిసాహసమువలదు.

లవు—అగును! మునిబాలకుల కధైర్యంబులే సహజంబులు. ఎఱుంగుదువుకదా నిమీ! నేను వీరక్షత్రియకులసంభవుఁడనగుట!

నిమి—సీతాతనయా! చాలు. చాలు. నీపౌరుషవాక్యంబుల నింకఁ గట్టిపెట్టుము. రాముని పేరు విననమాత్రంబుననే లోకత్రియంబులు గడగడవడంకును. ఆమహాబలశాలియాగతురంగంబేసి? పసిపాపఁడవగు నీవు బంధించుటేసి? జగంబుల నీపాటి వీరక్షత్రియులు లేకనే దీనినిట్లు విడచిరనుకొంటివా? రామునకుఁ బ్రతివీరులే భువనంబులందుండుచో నావిధంబున యశ్వలలాటభాగంబున బిరుదపట్టంబుఁగట్టి పంపుదురనుకొంటివా?

హయరక్షకులు వెనువెంట నగణ్యసైన్యంబులతో వచ్చుచుం దురు. గడుసుతనంబుమాని వేగిరమాతురంగంబును విడచి వేయుము. ఆశ్రమంబునకుఁ బోవుదము.

లవు—నిమీ! ఎంతపిఱికివాడవు? రాముఁడే సపరివారంబుతో వచ్చుటకాదు, చతుర్దశభువనంబు లేతెంచినను యీసవనాశ్వంబును నేను విడచుటమాత్రము శశివిషాణప్రరోహము. "ధీరులుండినఁబట్టవచ్చు" ననికదావారియభిప్రాయము. నేను ధీరుఁడనే. కాన యీకృతుతురంగంబును గట్టుట తప్పు కానేరదు. రక్షకులు వెనువెంటవచ్చుచుందురుకదా! అటుపిమ్మట జఱుగనున్నది నీవు చూచుచుండుము. భయమేమియు లేదు గాని యధైర్యంబు లాడకుము.

నిమి—లవా! చెప్పినవినవు. నీయన్నగారైన కుశుఁడు వెంటయుండిన నీవింతదుండగంబునకుఁ బాల్పడవు. ఈవార్త వాల్మీకి గురుఁడే వినినపక్షమున మనలకోపగించును. పావనశీలయగు మీతల్లిగారే యెఱింగికొనిన నసువులఁ బరిత్యజించును. ఏల యింత సాహసముఁ జేయుదువు?

లవు—మునికుమారా! ధీరుఁడగువానికి సాహసమే ప్రధానలక్షణము.

నిమి—ఆశ్రమములందు మునీందారాధనలచే కాలము వెళ్ళించు మనకు ధీరత్వము లేల? సాహసము లేల? తగదు. తగదు. ఆగుఱ్ఱమును విడచివేయుము.

లవు—మిత్రుఁడా! చాలుఁ చాలు. నీవిందుండిన శత్రుసైన్యంబుల యెదుటఁగూడ నిట్లనే పలుకుదువుగాఁబోలు! అంతభీరుఁడవైన చో సైన్యంబులు వచ్చి పడకమున్నే యాశ్రమంబున కరుగు

ము. నేనుమాత్రము రిపులతోఁ బోరి విజయమైన నందవల
యును. లేదా, వీరస్వర్గమైనఁ బొందవలయును.

—అఁ! ఈబీరంబు లాసైన్యంబులువచ్చి పైఁబడునప్పుడుండునా?
రామున కనేకాక్షౌహిణీలసైన్యంబులు కలవని వాడుకగలదు.
అందందఱు ననమానవీరులే! ఆతనితమ్ములైనను నిజముగా న
ఖండబలసంపన్నులు. వారలకు లోకత్రయంబులు భీతిల్లునను
టయందెంతమాత్రము సందియంబులేదు. సృష్టికిఁబ్రతిసృష్టి
నలిపినవిశ్వామిత్రుండంతటివాఁడె మున్ను రాక్షసులబాధలు
పడలేక యారాముని, వారియనుజులనడంగాఁ గైకొనిపోయి
దైత్యులహతంబుఁ గావించి యాగంబులొనర్చినాఁడు. తొల్లి
దండకారణ్యంబునఁ దమ్మునితో సంచరించుచు నెంతెంత ర
క్కసుల నుక్కడగించి యెందఱొదరిమునిస త్తములరామచం
ద్రుండు కాపాడెనో లోకంబులెఱుంగకఁబో లేదు. ఇంతయే
ల, భువనంబులన్నియు లేకమైనతనయాజ్ఞను మీఱకవ ర్తింపఁ
జేయుచు గడగడవడంకఁజేసిన యారావణాసురుని, పుత్రమిత్ర
భ్రాతృకళత్రాదిసకలపరివారంబులను లంకాపురంబుపైఁ బడి
యారాముఁడు భస్మీభూతముసేయుట యెవరెఱుంగనివి శేష
ము? మునికుమారా! మహ త్తరంబులగు శ్రీరామచంద్రునిపరా
క్రమకార్యంబులనేకంబులు. అట్టిలోకైకవీరునితోడనా నీవిప్పు
డు ప్రతివీరుఁడవై నిలచి రణంబుసేయ నుద్యోగించుట! కృ
పానముద్రుఁడై నరాముఁడుగాని, వారితమ్ములైనను నిన్ను
పసిబాలుఁడవని కనికరంబుఁబూని విడచిపెట్టవలయునేకాని,
వారలనెదుర్కొని నీవింకజీవంబులతో వచ్చుటమాత్రము స్వ
ప్నగతవృత్తాంతము. (పరికించిచూచి) అదిగో! అటుచూడుము.
ఆసైన్యంబులగణ్యంబులుగా వచ్చుచున్నవి. నాకిప్పుడే యొ

డలు కంపమెత్తుచున్నది. నేనిందు నిలువఁజాలను. ఓ కుమారా! మహాకష్టములందున్న నీతల్లిగారికేల నీవిట్టికాని కార్యము నకుఁ దలఁపడి దుర్భరదుఃఖమును కూర్చెదవు. కాని యిప్పటి కైన నామాటఁ జాటించి యీహాయంబును విడచిరమ్ము. ఆసైన్యంబులు వచ్చిపడునంతలో మనము పరువెత్తుకొని నిజ నివాసంబున కేఁగుదము.

లవు—నిమీ! యుద్ధరంగంబున నేనొకచో గతించినను మాతల్లిగారికి నావంటివాఁడు మాయన్నయైన నుండెను. పాపము నీతల్లి దండ్రులకు నీవేకపుత్రుఁడవు. నీవిందుండిన నాకైన నపజయమే లభియించునేమో గాని వేగిర మాశ్రమంబున కరుగుము. నేనుమాత్రము రాను.

నిమి—సరే! నీకర్మము నీవేయనుభవింతువు. నేనుపోయి జానకీదేవికిని కుశునకు నీవృత్తాంతముఁ దెలియఁబఱచెదను.

లవు—మునికుమారా! సంగ్రామంబున జయాపజయంబులు చూచి వెళ్ళెదువులే! భయమేమిగాని, యంతదనుక నుండుము.

నిమి—లవా! నీమూర్ఖమే నీకుగాని చెప్పినమాట సుంతయేని వినవు. బలంబులు వచ్చుచున్నవి ఏమిమూడునో?—

(అని యిరువురు నిష్క్రమింతురు.)

[తెరపడును.]

(శుద్ధవిష్కంభము.)

## రంగము.

### ప్రదేశము—పర్ణశాల.

[సీత ప్రవేశించును]

మ. సకలైశ్వర్యము లుండఁగాక, సుఖకష్టంబుల్ విచారింపఁగాఁ
బ్రకృతిన్ దల్లియుఁదండ్రియున్న, ననుకంపన్ జూడ నాధారభూ
తములౌ పుత్రికు లెందఱున్న, విధికృతన్ జేసి కాన్నట్టి భ
ర్తకు దూరంబగు నింతిజీవితము వ్యర్థంబే కదా యారయన్.

"ఏనాఁటికైనను మనోహరుఁడే తేరి నన్నుఁ గొనిపోవు" నని మున్నాలంకాపురీయశోకవనములోఁ గడపిన దినములనాఁడు కొంతైన ధైర్యంబుగలదు. అక్కటకటా! ఇఁక నాకల్పాంత మాత్మప్రియువిదూరమైన, అశ్రుకష్టంబులకే భాగకురాలఁగాఁబోలు! హా! మనోహరా! ఒకనాఁటికైన మీయనురాగవీక్షణముల నీనిర్భాగ్యురాలిపై మఱల్పరా? విశ్వాత్ములగు మిమ్ముల భర్తగాఁ బడయుటమాత్రమే నామహాభాగ్య విశేషమని సంతసింతును. కాని, నాథా! కలప్రుఁదీర తద్దాంపత్యసౌఖ్య మనుభవించుటకీజన్మమున నీశుభదినములు లేకఁబోయెనుగదా! క్రూరమగు క్షత్రియధర్మసంబధులైన సన్ముల్లకేగాని, జీవితేశ్వరా! మీప్రేమ మకలంకము, అవ్యాజము, అపారమైనదనియే సదా విశ్వసింతును ఎటులైన మిమ్ముల నంటుకొనియుంట నాకును జన్మసాహిత్యమేగాని, ఆత్మేశ్వరా! పెద్దకాలంబునకుఁ గలిగిన యీరఘుకులాంకురములనైన నాదరించి యభివృద్ధిఁజూవరా! "జానకీ! ఏనాఁటికైన నీరఘుకుల విస్తారంబునకు నీవే కారకురాల" వనికదా మఱఁదిలక్ష్మణుఁడు నన్ను, కష్టములు భరియింపఁజాలక సాహసకార్యంబులఁ జేసి

కొనక జీవంబులతో నుండుమని కోరియున్నవాఁడు. అప్పటి పరిస్థితినిబట్టి యట్టియురునయవాక్యము లాడుట తప్పనిసరి యాయెనేగాని, యాతనికేమి నేనైనను, నాబిడ్డలైన నింక జ్ఞప్తికివత్తురే! భర్తకే కొఱగానిదాననైన తదితరబంధుగు లేమి, తల్లిదండ్రులేమి, నన్నింకనై చుదురా? హా! ప్రాణేశ్వరా!

సీ. తప్పింగలేదుకదా! స్వప్నములనైన,
యేనాఁడు మీయాజ్ఞ నేను నాథ!
కష్టపెట్టఁగలేదు కద! యొకనాఁడేని
తల్లిదండ్రులను చిత్తముల నాథ!
తావించియుండను కద! యపకృతు లెన్నఁ
డైనమహాభాగులందు నాథ!
ఎడబాటుఁగూర్పలేదేకదా! యేజన్మ
నెవ్వారిదాంపత్య మేని నాథ!
గీ. ఏమహాపాపమిట్లు ఫలించె నాకు
సంతతమహాశ్రమలతో విషాదభరిత
జీవయాత్రను వెళ్ళింపకే జీవితేశ!
ప్రాకృతులగు మీరె హృదీశ్వరుఁడుకాఁగ.

శా. "ఈవంశోద్ధరణంబుసేయుటకు నీవేముఖ్యమాదాన వె
ట్లో వెళ్ళించుము కాల" మంచు నను బేర్మిమోదార భావంబుతో
నావాల్మీకియునేలఁగాచవలె? పుణ్యంబాటఁ గాపాడఁగా
నీ, వాత్సల్యము మీకు లేనియెడ నాకీజీవితంబేటికో?

హా! నాథా! మహాకష్టకాలమున నాకుఁగలిగిన యీబిడ్డలైనను మీప్రేమాదరణమునకుఁ బాత్రులుకారా? తల్లిదండ్రుల ...బుల నలంకరించి, అనుదినసంతోషణభావణంబు

లతో, అత్యంతవిషాదవినాశకరంబులగు ముద్దుముచ్చటల
తో నభిలషించెదు వాంఛితంబులకుఁ గొఱంతలు లేక, సౌకు
మార్యముగా, సౌఖ్యవంతముగా, సౌభాగ్యము లనుభవింప
వలసిన యీచిఱుతలకుఁగూడ, నాకడుపునఁబుట్టిన హేతువున
గదా, మనోహరా! యీ లేఁబ్రాయముననే యఖిలాభీష్ట
రాహిత్యమును, అగణ్యకష్టప్రాప్తియు సంభవంబులు! ఎన్నఁ
డైన నాజీవితావస్థలఁ దలంచుకొనుచు బరితాపమందుచో
బిడ్డలరుదేరి, "అమ్మా! నీకీకష్టము లేమి? మాతండ్రి యెవ్వ"
రని నన్నడుగుచుందురే కాని, ప్రాణేశ్వరా! ముక్కుపచ్చ
లారని యీపసిపాపలకు నాసంపూర్ణచారిత్ర మెఱింగించుచో
నెంతఁజింతింతురో, యేవిధంబున బెంగఁగొందురో, యేమి య
నర్థకములు వాటిల్లునోయను భీతిచే మిన్నకుందునేగాని, యెం
తకాలమని సైరఁగలను? కాన్పుసమయమగుటచే నాకుఁగలిఁ
గిన మహాకష్టమున కోర్వఁజాలక, కృపామయుండగు నీ వా
ల్మీకిభగవానుఁ డింతకాలంబునుండి కనికరించుచుండిరిగాని,
నాథా! యీబిడ్డలతో నింక యీజీవితంబుతయు నొరులపం
చల నెట్లు వెళ్ళింతును? ఎంతకాలము మమ్మామునిచంద్రుఁ
డు భరియింపఁగలఁడు? ఈజీవితశ్రేయంబులకిఁక సర్వాశాప
రిపూర్తి నిశ్చయించుకొని నే నేదో యొకదారిఁద్రొక్కుదు
నా, జీవితేశ్వరా! మీరేయెల్లని యీబిడ్డలేమైపోదురో?
తల్లిదండ్రుల కెడమైనబిడ్డల జీవితములు నిరర్థకములుగదా!--
హా! మనోహరా!—

[నిమి ప్రవేశించును.]

తల్లీ! జానకీ! కుశం డింకరానేలేదా?

సీత—నాయనా! ఎవరును రాలేదు. నేఁడు మీరందఱు కలసియుం
డలేదా ?

నిమి—కుశుఁడు మాతోఁ రాక యెచ్చటికో యేగెను. నేను, లవుఁడును
గురుకార్యార్థులమై యరిగితిమి.

సీత—లవకుమారుఁ డింకను రాలేదేమి నాయనా?

నిమి—అమ్మా! నేఁడుమాకనధ్యయనదినమగుట లవుఁడు, నేనును
కలసి యాటలాడుచు నటవీమధ్యంబునకుఁ జొచ్చితిమి.

సీత—(భయముతో) ఏమైన నాపద సంభవించెనా ?

నిమి—జానకీదేవి! ఏమి తెలుపుదును? అట సంచార మొనర్చుచున్న
మాకాకస్మికముగా నొకయజ్ఞీయాశ్వంబు కానంబడినది.

సీత—మా లవుఁడు దానికేదేని యపకృతిఁ గావించెనా?

నిమి—సాధ్వీ! అపకృతి గాదు, దానిలలాటభాగమందుఁగల బిరుద
పట్టంబుఁ గాంచి లవుఁడు వీరరసావేశుఁడాయెను.

సీత—మునికుమారా! బిరుదపట్టమేమి ?

నిమి—తల్లీ! "వీరక్షత్రియకులసంజాతుఁడగు రాముఁడఁట! అదివారి
యాగతురంగంబఁట! వారితమ్ములు దానిరక్షకులఁట! జగం
బుల ధీరులున్న బట్టవచ్చునఁట!" ఈపౌరుషవాక్యంబులే మన
లవుని యొడలు క్షణములో మఱపించినవి. అశ్వమును బం
ధించినాఁడు.

సీత—ఔరా! ఎంతపనిజఱిగినది! మునికుమారా! నీవైన హిత
ములఁ గఱుపకఁబోతివా?—

నిమి—అమ్మా! బ్రతిమాలుకొంటిని. గడుసుతనంబున లవుఁడు నా
మాటఁ బాటింపఁడాయెను? ఏమిసేయుదును?

సీత—ఎంతటి జగదేకవీరులు సవనాశ్వంబుల బంధించుట కర్హులు!
ఎవరకుఁగొఱగానివారలమై మహాకష్టంబులలో మునిఁగియుండి

పుణ్యాత్ముఁడగు నొకమునీంద్రుని యాశ్రమమందు తల దాచుకొని దినములు కల్పములుగా వెళ్ళించుచున్న మాకీ కర్మముగూడ యేమి? లవుఁడుగావించిన యీదుండగంబు బ్రాచేతసులవా రెఱుంగుచో నింక నొక్క క్షణమైన మమ్ములఁ దపపంచ నుండనిచ్చునా? అయ్యో! మఱల నెట్టిదినములు మూడినవో? కుశుఁడు లవుడట్టి దుండగీడుకాడు. నాని నెచ్చో ట నేఁడు నీవు చూడనేలేదా?

నిమి—అమ్మా! లేదు.

సీత—ఈవృత్తాంతము వల్మీకిమునీంద్రుల కెఱింగించితివా?

నిమి—నేఁడు గురువుగా రాశ్రమంబున లేరు.

సీత—మంచియవకాశమే చిక్కినది. లవకుమారుఁ డాతురంగంబు కడనే యున్నవాఁడా?

నిమి—తల్లీ! వృత్తాంతమంతయు సవిస్తరముగా వినుము.

సీత—(భయముతో) నాయనా! నాకుడిభాగ మదరుచున్నది. అమంగళము లేమియైన సంభవించినవా? వేగిరమెఱింగింపుము.

నిమి—సాధ్వీ! నీవు వీరమాతవు. నీకుమారు లసమానవీరులనుటకైన సందియంబు లేదు. లవుఁ డాయశ్వమును బంధించిన హేతువైన నిట్టిదే! "వీరపుత్రుఁడనగు నేను ఘాలాత్ముఁడడ్డగించిన నీయశ్వంబును విడువ"నని ప్రతిజ్ఞాబద్ధుఁడై యున్నవాఁడు. "బాల్య చాపల్యమున నింతదుండగంబు తగ"దని నేను పలుమాఱు లాతనికి బోధించితిని కాని నన్ను పిఱికిపందగా నిర్లక్ష్యము జేసినాడు.

సీత—నాయనా! మీదట నేమిజఱిగినది?

నిమి—అమ్మా! శత్రుసైన్యంబులు వచ్చిపడినవి.

సీత—ఆఁ ! ఏమి ? ఒక్కబాలునిపై నిష్కారుణ్యముగా సైన్యంబులే
వచ్చిపడినవా? తరువాతవిశేషమేమి ?

నిమి—సాధ్వీమతల్లీ ! యాగాశ్వంబు పట్టుపడుచోఁ గ్రతుభంగమగు
నని నిగమమార్గమైయున్నది గాన తద్రక్షణంబునకు, శత్రు
ఘ్నుండఁట!, మహాబలుండొకండనేకవేలసైన్యంబులతో వచ్చి
లవకుమారు నెదిర్చినాఁడు. సాత్వికభాషణంబులుం, సామో
పాయంబులు నప్రయోజనకరంబులగుట లవునితో వారలకు
ఘోరసంగ్రామమే కర్తవ్యమైనది.

సీత—నాయనా ! లవా ! ఏమంతబలశాలివైతివని యీప్రాయంబు
న కప్పుడే లేనిపోని సంగరంబులఁ దెచ్చిపెట్టుకొంటివి? నీవ్రా
తలెట్లున్నవో కదా !—నిమీ ! అంత వృత్తాంతమేమి ?

నిమి—తల్లీ ! యుద్ధము భీకరంబుగా జరిగినది. పసిబాలుఁడయినను
మిగులసాహసుండగు మనలవుని వంచించుటకు శత్రుసైన్య
మందొక్కఁడైన శక్తుఁడు గాఁజాలఁడాయెను.

సీత—అగునగు ! ఆచతుర్దశభువనైకపరాక్రమవంతులకు బిడ్డలే
కదా కుమారా !—

నిమి—లవుని శస్త్రపరంపరలకు రిపుసైన్యంబులు మూఁడుపాళ్లు క్షీ
ణంబులైనవి. అప్పటికి జయలక్ష్మి యీవీరకుమారపక్షంబు
ననే యున్నది. బహుపరాక్రమవంతుఁడే యగుఁగాక! అమ్మా
అసంఖ్యాకములగు సైన్యంబుల నొక్కఁడెట్లు సాధింపఁగలఁడు?

సీత—నాయనా ! అంతట నేమిజరిగినది ?

నిమి—పతివ్రతామతల్లీ ! ఏమిచెప్పుదును ? శత్రుపక్షంబునందు
మహాబలుం డొకఁడు గినిసి మనలవునిపై దివ్యాస్త్రప్రయో
గంబుఁ గావించెను. అయ్యది నీ కుమారున కనివార్యమగుట,
"ఈయస్త్రమును మాయన్నకుశుం డుండు నెడనుపసంహరించు

నుగదా !" యని చింతించి యెట్టకేలకు మూర్ఛావశుం డా యెను. లవకుమారునిపరాక్రమంబున కబ్బిం బుఁజెంది శత్రు ఘ్నుఁ డాతని నిజరథంబుపైనిడుకొని పోవుచున్నవాఁడు. అమ్మా! కుశునికై వెదకితిని గాని యాతనిజాడ లేమియుఁ దెలియవా యెను. ఈవృత్తాంతము నీ కెఱింగింపవచ్చితిని.

సీత—(దుఃఖముతో) హా ! కుమారా! ఎంతపని జఱిఁగినది? ఏనాఁటి కైన మీవల్ల నాకష్టములు కడతేరునని గంపెడంత యాశతో నుంటినే ? నాయనా ! నాకడసారియాశలకుఁగూడ భంగ ములు వాటిల్లినవా ! భోగభాగ్యంబులు లేకఁబోయిననేమి, యాపదలందు గలిగిన మగబిడ్డలుకదా యెప్పటికయిన నాధా రభూతులగుదురని యెంతెంతదుఃఖములనో దిగమ్రింగి యీ మొండిప్రాణంబులను బిగబట్టుకొనియుంటినే కాని, యింతలో నిట్టియవాంతరమాభగవంతుఁడు గూర్చునని తలఁపలేదుకదా! అయ్యో ! తనయా ! నాముద్దుల తండ్రీ !

సీ. ఉదయకాలంబున । నిదుర లేచెడు వేళ,
"అన్నమమ్మా !" యంచు । నడుగరావె ?
కుశునిఁ గాంచనివేళఁ । గొండంత బెంగతో,
"అ న్నెడకరిగె ?" నం।చడుఁగరావె?
సాటిబాలురఁగూడి । చదువు నేర్చెడు వేళ,
"అందఱిలో మిన్న" । యనుచు రావె?
బ్రతుకంతతలపోసి । పరితపించెడు వేళ,
పెంపుతో న న్నాద।రింపరావె?

గీ. బాల్యచాపల్యమునఁ గొంటె । పనులఁజేసి
జగడముల నెన్నొ తెచ్చిపెట్టఁగ రావె?

నీవిలాసము లన్ని వర్ణించుకొన్న
బ్రతుకఁగలనయ్య యింక గారంపుకొమరక !

అయ్యో! నానాఁటికి నాకష్టము లనంతము లగుచున్నవి. దైవమా! యింతకఠినకరీతు నేలసేయుదువు? ఏజన్మమునైననేమి, నన్నిట్టి క్రూరశిక్షల పాలొనరించుటకు, నీయెడ నెఱుఁగక మహాపరాధ మేమియు నొనర్చియుండనుగదా! నాయనా! కుమారా! మహాపదలందు మిమ్ముఁ గని కన్నవారలకేమి, కట్టుకొనిన వారలకేమి కొఱఁగాక దూరమై, యేవలననైన మీమూలమునఁ గృతార్థురాల నగుదునని సంతసంబడితినే కాని, యీ విధంబున నీవకాలమృత్యువాతంబడిన పుత్రవియోగదుఃఖము కూడ భరింపవలయునని కలనైనఁ దలఁపలేదుకదా! నీముద్దులపలుకులు, నీమోహంపుహావవిశేషంబులు నెట్టికిరాతహృదయునకైనను, సంపూర్ణానుకంపభావంబులును, సరసప్రేమాదరణవిలాసంబులును కలిగించునుగావా? నాయనా! ఆయాగాశ్వరక్షకుఁ డెంతకరుణారసవిహీనుఁడో కదా! ఒక్కక్షణమైన నీయన్న నెడబాసియుండనివాఁడవే, కుమారా! నేఁ డొక్కరుండ వరణ్యమధ్యంబున కరుగఁ బుద్ధి యేలజనియించినది? వెళ్ళితివి పో! ఆయాగాశ్వము నీకంటనే బడవలయునా? కంటఁబడియెను పో! నీసామర్థ్యము నీవు గుర్తించుకొనక బాల్యచాపల్యమున దాని నేల బంధింపవలయును? బంధించితివి పో! రిపుసైన్యంబు లసంఖ్యాకంబు లగుట యెఱింగియు నొక్కరుండ వేమిటికిగాను మహాసంగ్రామంబుఁ బూనితివి? అయ్యో! అన్నియు నిట్టు లేకీభవించినవి కావుననే నీకీలోకసంబంధము తెగిపోయినది. నాయనా! అప్పుడే యేకష్టసుఖంబు లనుభవించి యేనూఱేండ్లు నిండినవని నన్నుఁ బాసితివి! దయారసవిశే

షులైన ప్రాచేతసులవారు, "జానకీ! మాలవుఁ డతిసాహసుం డు, ఎట్లుసాకుదువో, భద్రము సుమా!" యని తఱచు హెచ్చరికలు సేయుచుండెడువారుకదా, అయ్యో! ఆగురుండు లేని సమయంబున నిట్టిదుష్కార్యకరణంబుఁబూని కుమారా! నాకు జన్మజన్మాంతరానుభవదుఃఖముఁగూర్చి పోతివేమి? వాల్మీకి భగవానుఁడు, కుశకుమారుఁడు నేతేరి, "లవుఁ డేడకరిఁగె" నన్న నాయనా! యీపిడుగువంటి వృత్తాంతము వారల కెట్లు తెలియఁబల్కుదును? అతిమృదులమై, అసాధారణతేజోయుతంబైన నీశరీరంబును తీక్ష్ణబాణపరంపరలచే నొవ్వఁజేయు నాశత్రునిచేతు లెట్లాడెనో కదా! నీముసుకుచేష్టలకుఁ గోపగించుకొని, యెన్నఁడైన నేను నీబుగ్గలు మెలియఁబెట్టుచో, నెఱ్ఱఁగఁగందు బారిన, వలవలయేడ్చుచుకుశునకుఁజూపి, "అన్నా! అమ్మ నన్నెట్లుశిక్షించెనో చూచితివే?" యని మొఱఁబెట్టుకొందువే తండ్రీ! ఆశత్రులశస్త్రప్రకరంబుచే శరీరంబున గాఢంబుగనాట యెంత బాధనొంది పరితపించితివో? ఎవరితో నీగో డెఱింగించుకొంటివో? హా! పుత్రకా!—

నిమి—అమ్మా! కష్టములలో కష్టములే గాని సుఖములుండవు. మూర్ఛనొందెనేకాని లవునకు ప్రాణభీతి లేదు. ప్రాజ్ఞురాలవు నీవంతగా యిప్పుడు దుఃఖించుటకూడదు. ఊఱడిల్లుము.

[కుశుఁడు ప్రవేశించును.]

ఏమి! నేఁ డన్నియు నమంగళరాహిత్యములుగా నున్నవికదా!

సీ. ఏలొకో నేఁడు మునీంద్రకుమారుల
నిగమాగమపఠన । వినుతి లేదు!
ఏలొకో నేఁడు మునీశ్వరప్రకరంబు
లలఘుతపోవృత్తు । లందు లేరు!

ఏలొకో నేఁ డింక మా లవుఁ డేనియు
నెదురుగా నను గౌఁగిలింపరాడు!
ఏలొకో నేఁడు సాధ్వీమణి నాతల్లి
యింపుతో నన్నుఁ బ్రేమింపరాదు!
గీ. ఏలొకో నేఁడె యీకర్ణశాలకూడ
తొల్లియటుఁగాక కళలేకఁ దోఁచుచుండె;
ఏమియుత్పాతములు సంభవించినవియొ?
యాపదల కమంగళసంభవంబె కాదె?

కానిమ్ము. అంతయుఁ దెలిసికొందును.

నిమి—అమ్మా! జానకీదేవీ! సమయమునకే కుశకుమారుఁ డరుదెంచినాఁడు.

సీత—(దుఃఖముతో కుశుని కౌఁగిలించుకొని) నాయనా! నేఁడు నీవు తమ్మునితోఁ గలిసి పోవలేదా?

కుశు—అమ్మా! లేదు. తమ్ముఁడును మునికుమారుఁడును కలిసి యరణ్యంబున కరిగిరి. నేను వాల్మీకులవారితో జాహ్నవీతీరంబునకుఁ జనితిని. నేఁడు మన లవుఁ డింకను రా లేదా?

సీత—అయ్యో కుమారా! ఇంక మన కెక్కడిలవుఁడు?

కుశు—తల్లీ! అట్లనియెద వేమి ?

నిమి—కుశకుమారా! అరణ్యభాగంబున నేఁడు మీలవుఁడొకసత్రహయంబును బంధింప తద్రక్షకులగు శత్రువు లరుదేరి యుగ్రసంగ్రామంబుఁ బూని యందు మూర్ఛాయుతుండైన మీ తమ్మునిఁ దోడ్కొని యేగుచున్నవారు.

కుశు—(దుఃఖముతో) కటకటా! ఎట్టి వృత్తాంతము వినుటయైనది ? నాముద్దులతమ్ముఁడు లవుఁ డేడ? యాగహయంబును బంధించుటేడ? శత్రులకుం జిక్కుటేడ? నిమీ! ఇంతయు నేఁడు

నీదృష్టిపథముననే జఱిఁగినదా? హా! తమ్ముఁడా! ఎట్టిపాటు సంభవించినదిరా? నేఁడు నేను లేకనే యింతపని నేలచేసితివి? ఒక్క తెప్పపాటుకాలమైన నన్నన్నఁడు విడచియుండనివాఁడవే కదా! హా! అనుజా!

ఉ. ఆపదలందుఁ జిక్కి, నిర।తంబు నిజస్థితులం దలంచు, చిం
తాపరితాపభారమునఁ। దోఁగుచునున్న యనుంగుఁదల్లి, దుః
ఖాపశమంబుఁ గాంచె నెటు।లో సుతులం గని, యట్టిభాగ్యమున్
బాపెను నేఁటితో విధి, వి।పత్తులయందు సుఖంబు లుండునే?

సీ. సారెసారెకు గురు।సన్నిధిఁ గొండెము
లెన్నెన్నొ చెప్పవా। రెవరు మాకు?
చీటికిమాటికిఁ। జిత్రింపుజగడాల
నింటిపైఁ దెచ్చువా। రెవరు మాకు?
మాటిమాటికి నస।మానవీరోక్తుల
నింక పైనాడువా। రెవరు మాకు?
నిమిసనిమిసమున। నిస్తులానందంబు
నేలీలఁ గూర్చువా। రెవరు మాకు?

గీ. అన్నిటికి నీవె ముఖ్యుండ।వగుట మాకు,
నట్టిచేష్టలనైన భ।రించియుండ
గురుఁడు సైతము, కోపంబుఁ। గొనక యనుజ!,
గడుపుచుంటిమి దినములు। కల్పములుగ.

"అన్నా! పరిశుద్ధురాలగు మనతల్లికష్టములు కడతేర్ప నెన్నటికైన మన మాధారభూతుల"మని తఱచు నాతో నేకాంతభాషలొనర్చుచుండువాఁడవే, తమ్ముఁడా! దిక్కుమాలి దీనావస్థలం దున్న యీతల్లి కేమి ధైర్యముఁ గఱపి, యెట్టిదారిఁ జూపిపో యితివిరా? "గోరుచుట్టుపై రోఁకటిపోటువలె" నీయకాలపుత్ర

వియోగదుఃఖముఁగూడ సైచి మనకన్నతల్లి యసువులనింక భరియింపఁగలదా? నిమిసకాలంబైన నెన్నఁడు నిన్నువిడచి యుండని నాకైన నేఁడు నీతోఁ గలసియుండని దుర్బుద్ధియేల జనియించినదో? తమ్ముఁడా! నాగతియేమి చెప్పి పోతివిరా?

చం. ఇరువుర మొక్క తల్లికి జనించిన బిడ్డల, మొక్కచోటనే
పెరిఁగినవార, మొక్కయెడ విద్యల నేర్చితి, మొక్కరూపుతోఁ
బరఁగినవార, మొక్కనికె ప్రాణములిద్దఱి మాయఁబాడియా
టరుఁగుదు నేనుగూడ యను జా! పరిపంధి నెదిర్చి చావఁగన్.

ఇంతకంటె నింక నాకైన వేఱుమార్గము కలదా? సమస్తము భరియించిన తల్లి యెట్టులో నావిషయకమగు చింతకూడ సైపును.

సీత — నాయనా! మగబిడ్డవే, యాకదసైరఁజాలక విరక్తిమార్గముఁ ద్రొక్కుచో నేనుమాత్ర మింక యీజీవముల నెవరినిచూచుకొని నిలుపుకొందును?

నిమి — కుశకుమారా! వీరపుత్రుఁడవయ్యు సధైర్యాలాపములచే సీతలిగారికి మఱింతచింతఁ గూర్చుట నీకెంతమాత్రము తగదు. లవునకు మూర్ఛగాని ప్రాణభయ మేమియు లేదు. అతఁడిప్పుడు శత్రువులచేతిలోఁ జిక్కియున్నవాఁడు. యుద్ధరంగమున నిన్ను పలుమాఱులు స్మరించుకొనినాఁడు. ఎట్లైన నీవిప్పుడాతనిరక్షింపవలసినవాఁడవు. ధైర్యము వహించి వేగిరమట్టి ప్రయత్నములఁ జేయుము.

కుశ — నిమీ! మంచిది. నాతమ్ముని గాంచుటకన్న నింక వేఱు కర్తవ్యము నాకులేదు. (అని రౌద్రముతో)

మ. ఎవఁ డాక్రూరుఁడు, సత్రియశ్వముఁను బంధింపంగ నాతమ్ముఁడు
గ్రవనీభాగములో రణస్థలిని మూర్ఛాయత్తుఁ జేసి, శా

ర్యవతుండై కొనిపోవుచుండ రథమం । దాభర్గుఁడగ్డైన, నా
వివిధాస్త్రంబులఁ గుప్పించి యడఁతున్ । వేగంబె తద్వైరినిన్.

మునికుమారా! యింకజాగుపలదు. ఎఱుంగుదువుకదా శత్రువులరుం గుచున్న మార్గము నీవు! తల్లిగారి యాజ్ఞయు, నాశీర్వచనం బులుఁ గొని, తమ్ముని రక్షణంబునకు శాత్రువుల నడ్డగించి సంగరంబుఁ గల్పించెదను. (అని తల్లికి నమస్కరించి) అమ్మా! నీదుఃఖములకు మేరయ లేదు. ఎట్టులైనను మనసు శాంతిఁబఱ చుకొని యింకముందు జఱుఁగవలసినదాని యోజింపుము?

సీత—అయ్యో! బిడ్డా! యీదౌర్భాగ్యురాలి జీవితఁబునకింక శాంతి యెక్కడిది? సౌఖ్యము లెట్టివి? అన్ని సుకృతము లంతరించిన వి. కావుననే నాపాప్రారబ్ధకర్మముల నే ననుభవించుచున్నాను. ఇంక యోజించుట కేమున్నది?

నిమి—జానకీదేవీ! ఆపదలయం దెంతవారికి జీవితవిరక్తి కలుఁగుట సహజమైయున్నది.

కుశు—తల్లీ! మహాకష్టము లందున్నైనను ధైర్యవృత్తి నవలంబించుట యే నీబోటివీరమాతలకు స్వాభావికగుణంబులు. జరిగినదం తయు నెటులో మఱచి, ముందు కాఁదగినది విచారింపుము.

సీత—నాయనా! గురువుగా రాశ్రమంబునకు రా లేదుకదా?

కుశు—అమ్మా! వాల్మీకులవారిప్పుడురారు. వారువచ్చునంతవఱకు మనమూఱకుండు టంత శ్రేయముగాదు. శత్రువులు తమ్ము నిఁ గొనిపోవుచున్నారు. నేను వేగిరమరిఁగి వారలనెదిర్చి, యాహవంబుఁ జేసి, విజయంబుఁగొని లవునిఁ గొనివత్తును. శీఘ్రము న న్నాశీర్వదింపుము.

సీత—కుమారా ! అరిపుబలగంబు లసంఖ్యాకంబులే! ఒక్కరుండవు నీవైన నెట్లు సాధింపఁగలవు?

కుశు—సాధ్వీమతల్లీ! నాకు నీయాశీర్వచనబలమే శత్రుబలంబుకన్న వేయిరెట్లధికము. రిపుకోటి నిర్మూలనంబునకు హేతుభూతము కాన, సంశయింపక వేగంబె దీవింపుము.

సీత—నాయనా! నీయిష్టానుసారముకానిమ్ము. సర్వము దైవాయత్తమై యున్నదికదా !

తే. గీ. విభునియాజ్ఞను దాటక । వెలయుదేని,
తల్లిదండ్రులహితములఁ । దప్పనేని,
అతులపాతివ్రత్యమున నే । నలరుదేని,
విజయమగుఁగాక నీ కింక । విగ్రహమున.

నాయనా ! వెళ్ళుము. భద్రముసుమా !

నిమి—కుశకుమారా ! ఇంతకన్న శుభశకునము వేఱులేదు. బయలుదేఱుము.

కుశు—నిమీ! తల్లిగారి యాశీర్వచనమే శ్రేయోదాయకమై సర్వవిధముల నాకుత్సాహమును కలిగించుచున్నది. ఇంక శత్రుసంహారం బననెంత ? శీఘ్రముగ రమ్ము.

(అని యందఱు నిష్క్రమింతురు.)

(తెఱపడును.)



శ్రీరస్తు.

# కుశలవ

## షష్ఠాంకము.



ప్రదేశము :—యాగశాలప్రాంతము.

[పుష్పకుఁడు ప్రవేశించును.]

సందేహమేమి! అతిపవిత్రురాలగు సీతామహాదేవి తొలఁగినప్పటినుండియే యీయయోధ్యాపురమునకు, సూర్యకులసంజాతస్తవనీయజీవితంబునకును మహానర్థకములు ప్రారంభములైనవి. కటకటా! ఎట్టివారల కేమిపాట్లు సంభవంబులు! భువనకంటకుండగు వాలవణాసురుని సంహరించినజెట్టి శత్రుఘ్నుండును, తొల్లి రావణసంగ్రామంబున మేఘనాధాదిమహావీరులఁ బరిమార్చిన జగదేకధీరుఁడు సుమిత్రానందనుండును, సవనాశ్వరక్షణంబునకుఁ జని యిరువురు మునిబాలకులకుఁ జిక్కి సకలసైన్యంబులతో మడియు టెంతవింతగా నున్నది? లోకవిజయులైన రామప్రభుప్రున కెంతకష్టము వాటిల్లినది? అవును—

తే. గీ. కాల మిలఁజాలకున్న ని । క్కట్లుగాని
యెంతవారికి మేల్లు లభింప వరయ,
పవలు జగముల రక్షించు । భాస్కరుండు,
చెందఁడే హీనకాంతి ని।శీథవేళ.

జోరా! ఆమునిపుత్రు లెంతటివారలు! అచ్చునగ్రుద్దినట్లిరువురకాకృతే రూపముకదా! వారలతేజములు దేదీప్యమానములు. మహారాజపుత్రికళలేగాని యెంతపరిశీలించిన వారలయందు సంయమిబాలకుల లక్షణంబు లరుదు. బాగుగ యోజింప మీఁదు మిక్కిలి సుభగురాలైన జానకీదేవిపోలికలే వారలయందుఁగన్పట్టుచున్నవి. ఈవిషయమై యుద్ధరంగమున నంతగా నెవ్వరు పరిపాటిఁ బాటింపలేరు కాని, దూరాలోచనపరుఁడగు లక్ష్మణుఁడు మాత్ర మప్పుడప్పుడు, "ఈబిడ్డలందు మావదినగారి పోలిక లున్నవి. బాణముసంధింప నాకు చేతులాడుటలేదు కదా!" యని మిగులఁ బరితాపమందుచుండెడువాఁడు. వారల యత్యద్భుతపరాక్రమంబు నుపమేయంబులై—అరిసంతాన విభీకరంబులైయున్నవి. జోరారా! ఎంతెంతసైన్యంబుల—నేలాటివీరావతంసంబులఁ, ద్రుటికాలములో రూపుమాపినారు? పూజ్యుఁడైన వశిష్ఠమహర్షి సంధించిన శుభలగ్నంబులన్నియు రామనరేంద్రున కన్యథాపరిణమించినవి. అనాటి పట్టాభిషేక లగ్నము ప్రచండారణ్యనివసనంబునకుఁ గారణమైనది. ఈనాటి యశ్వమేధయాగలగ్నము విభుని సర్వస్వక్షయమునకే హేతువుగానున్నది. ఆమహాసంగ్రామముఁ దలంచుచున్న నత్యంతభయంబులును—ఆకంపితాంగంబులేగాని సాకితరగుణంబులు లేవు. వ్యాఘ్రములనడుమఁ జిక్కు భాగంబువోలె నాకింతకాలంబునుండి జీవంబులే లేవు. కర్మ మంచిదగుటచే యెట్టులో కొనప్రాణములతో బయటఁబడి యీవిషాదకర వృత్తాంతమును ప్రభుఁడైన శ్రీరామభద్రునకెఱింగించుటకే వచ్చితిని. ఏలయోజింతును? వేగిరమే విభునియెదుటఁబడి

తెలియఁబఱచుచోఁ గర్తవ్యము స్థిరపఱచుకొందురు.

(అని నిష్క్రమించుచును.)

(తెఱపడును.)

[ఇది విష్కంభము]

రంగము.

ప్రదేశము—అరణ్యము.

[కుశుఁడు—లవుఁడు ప్రవేశింతురు.]

కుశు—తమ్ముఁడా! రామాయణకథానాయకుండగు శ్రీరాముఁ డామహానీయుఁడే కాఁబోలు!

లవు—అగును. ఆప్రక్కనున్న యాతఁడే కైకేయీపుత్రుఁడైన భరతుఁడు. వారలిప్పుడు మహాసేనలతో దిగియున్నవారు. గతించినదానికంటె జఱుఁగనున్న యుద్ధము మిగుల భీకరంబుగానుండును.

కుశు—తమ్ముఁడా! ఏమోయనుకుంటిమి శ్రీరామచంద్రుని తేజోవిశేష మత్యద్భుతమనుటకు సందేహము లేదుకదా!

లవు—ఆభరతుడేమి? సమరరంగంబున జీవంబు లర్పించినశత్రుఘ్నుండు. లక్ష్మణుఁడైననేమి? ఆనలుపురన్నదమ్ములు మహాబలులనుటకు మాత్రము శంకింపనవసరము లేదు. వారలపరాక్రమంబులు మనసముఖమున నేపాటివి?

కుశు—ఇట్టివీరులతోడనే పోరి జయంబుఁ గాంచుటే మనకైన శాశ్వతయశోసంప్రాప్తము. వీరరణరంగంబున జీవంబులర్పించినను యుత్తమపదమే యలంకరింతుము.

లవు—అన్నా! అగును. అట్టిఘనసంకల్పముతోడనే కదా నేనైన నిట్టి కార్యమునకియ్యకొంటిని. మనమైన వీరమాతపుత్రులమేయని గర్వింతును.

కుశు—కారణమేమోగాని, యీరాముని చూచుచున్న మనతల్లిగారు జ్ఞప్తికివచ్చుచు నాకుఁ గనులయెదుట సాక్షాత్కారమగుచున్నది.

లవు—యుద్ధతరుణంబుల మనోవైకల్యముఁ గూర్చుకొనుట తగదు. ధైర్యమూనుము. ఆభరతుఁడు మనకడకేవచ్చుచున్నవాడు.

కుశు—ఏమి ప్రసంగించునో విందము. రానిమ్ము.

(భరతుఁడు ప్రవేశించును.)

(తనలో) ఔరౌరా! మునిబాలకులగుదురా వీరలు! వీరక్షత్రియపుత్రలక్షణంబులేగాని, వీరలయందు తదితర చిహ్నంబులు తోచుటలేదు. మూర్తీభవించిన శౌర్యతేజమంతయు నీబాలకుల ముద్దుమొగంబులఁ దాండవమాడుచున్నది. మావదినగారైన సీతాదేవిపోలికలే వీరలకున్నవనుటకు సందియంబుండదు. అదియే కారణముకాఁబోలు శ్రీరామమూర్తికూడ వీరలయెడ నత్యంతకరుణారసపూరితమనస్కుఁడై, "భరతా! వీరలు పసిపాపలగుట వధియించు టనర్హముగాన యనునయ వాక్యములతోఁ గార్యము సాధించు"మని నన్నుఁబంపినారు. ప్రస్తుత మట్లేవర్తింతును. (ప్రకాశముగా) బాలకులారా! ఎక్కడివారలు మీరలు?

ఉ. మీయతిబాల్యరూపములు, మీనగుమోముల సౌమ్యతంబు, లెం
తోయనుకంప మిచ్చెడు, నేఱుంగక దుష్కృతిఁ జేసినన్ జగ
ద్దేయుఁడునై చినాడు రఘుధీరుఁడు, మన్నన లంది యింక నే
నీయది యాగవాజినిడరే! క్రతుభంగముఁ దెచ్చిపెట్టకన్.

లవు—ఏమీ! మీ పన్నాగము బాగుగ నేయున్నది గాని యట్టిది పరాక్రమవంతుల లక్షణంబులు కావు. ఇంత యేల? మీ రంతటి యధైర్యకులగుచో నీయశ్వలలాటపట్టంబున, "మాక్రతుభంగము కాన దీని నెవ్వరు బట్టకుండు"డని తొలుదొల్తనే లిఖియించి పంపిన నెంత యోగ్యముగ నుండెడిది. ఇంత పరివారము నశింపకమున్న, యీ పరాక్రమవచనంబుల కేదో విధముగ మీలో మీరే సంతృప్తి జెంది, మాతో సంధి యోజించిన నెట్లుండెడిదో? తరుణ మిప్పుడు దాటినది. విభీషణరణరంగవిజయమో, వీరస్వర్గసంప్రాప్తమో రెంటిలో నేదియో యొండు నిశ్చయముగాని వేఱేమిసేయుట కున్నది.

కుశ—ఏమందువు? వీరకులోద్భవులరే! లోకంబులు జయించిన యన్నదమ్ములరే! ఇంతటి యనిర్వాచ్యము లాడుచో జగంబులు మిమ్ముఁ గాంచి పరిహసింపవా? సమయము కలిఁగిన సంగర రంగమునకు ప్రాణభీతిచే వెనుకాడుట మీ వంశంబున కుత్తమగుణమై యొప్పునేమో గాని, లోకైకవీరమాతపుత్రులమైన మాకు మాత్ర మట్టిహీనమార్గములు యుక్తములు కావు. శత్రుజనంబులతో సంధిత్రోవ లభిలషించెడు పిఱికిపందలము మేము కాము. ఇఁక నట్టిప్రసంగంబులు మాకడఁ గట్టిపెట్టుడు.

భర—అజ్ఞులారా! బాల్యమందున చాపల్యము, యౌవనంబున మదము, వృద్ధాప్యంబున దురాగ్రహంబును మానవజీవితల కభ్యంతరంబులు. మిగుల పసితనంబుననున్న మీ కింతటి గడుసుదనంబు తగదు. పరిపూర్ణకరుణాంతరంగుఁడగుట మా రామభద్రుఁడు మీయందు సుంతేని క్రూరత్వముఁ దలంపఁడు. అత్యంత ప్రేమాస్పదులును—అతి నయ భయగుణగణంబులతో వర్తిల్లు ననుఁగదమ్ములు లక్ష్మణశత్రుఘ్నులేమి, అసంఖ్యాకమగు

పరివారంబులేమి మీకతంబుననంతరించినను, అఖిలలోక విను తాశ్వమేధ భంగంబునకు మీరేమూలమైనను, సత్యగుణప్రధానుండగుట శ్రీరామచంద్రుఁ డింతవఱకంతయు సైచెనే గాని, మీయందుఁ గుటిలభావంబుఁ బూనఁడు. మీదేదివ్యమానరూప తేజోవిశేషంబులు— మీయసమానసాహస విలాసంబులు— మీయత్యద్భుత బలపరాక్రమ ధైర్యగుణ గణంబులును రామచంద్రుని కబ్బురంబుఁ గూర్చుట యట్లుండ, మీదు మిక్కిలి మీ యెడ నపారకృప జనియింపఁజేసినవి. సంపూర్ణాగ్రహభావంబు లేకలుఁగుచో సర్వలోకవిజయుఁడైన మారామునకు మీరేపాటి ప్రతివీరులు? ఇప్పటికైన బాగుగ యోజించుకొని, మీదుష్కార్యకరణంబునకుఁ బశ్చాత్తాపము వహియించి, క్రతుతురంగంబు నర్పించి, దయాసముద్రుఁడైన రామభద్రుని శరణుకోరుకొనుటయే మీకు సుభగమార్గమైయున్నది.

లవు— అగునగు! వీరకులసంజాతుఁడవుగాన యోగ్యమగు మార్గము తెలిపితివి.

ఉ. మాజనయిత్రి సచ్చరిత । మాదియు వీరకులంబె, లోకవి
భ్రాజిత కీర్తివంతులర । భావ్యంపు భాషలనాడఁజెల్లునే ?
తేజముజూపి పోరవలదే తరుణంబు లభించు! నేమిగా
యోజనచేసివచ్చితిరి? । యుద్ధములేక హాయింబుఁ గొందురే!

కుశు— తమ్ముఁడా! ఇంక నీకు సంశయమేమిటికి? యుద్ధముసేయువీరులు మున్నెవచ్చిరి. వచ్చిరి. వీరిప్పుడు సంధికార్యమునకే యేగుదేరిరి. (భరతునిఁజూచి) ఓయీ! వీరాగ్రణీ!

తే. గీ. మీరు చెప్పినట్లు మెలఁగి, । మీకుసాయఁ
బడుచు, మీకాళ్ళకును మ్రొక్కి । బ్రతుకుగడుప

వెనుక మీయన్నకును జిక్కి । వెతలఁబడిన
గహనములనుండు కోతిమూఁకలముగాము.

భర—(కోపముతో) ఛీ ! ఛీ! దురాత్ములారా ! పసిపాపలని దయఁ జూపుచున్నకొలఁది తలకెక్కుచుండిరే! మీపాటి వరాకో మంబులు మాకు లేవనుకొంటిరా ? నిఖిలజగజ్జేగీయమానుఁ డైన మారామభద్రునే ధిక్కరించి యెగ్గులాడ మీరెంతటి శూరులు? అన్నివిధముల తనకు హానిఁజేకూర్చినను, వెఱ్ఱివాడు కాన నపారకృపాసముద్రుఁడై యింతవఱకు మీయందు రఘు రాముఁడు జాలిఁజూపుచున్నాఁడే గాని, యామహనీయుని యాగ్రహ వీక్షణంబులే మీపయిఁ బ్రసరింపఁజేయుచో నొక్కత్రుటి కాలములో భస్మీభూతులు కాకుందురే? అంతయేల? అగ్ర జుని యాజ్ఞలేదని వెనుకాడుచుంటినే కాని లేనియెడల మిమ్ముల నెప్పుడో నాయీకరవాలమునకే బలియొనర్చి యుందును.

(రాముఁడు ప్రవేశించి.)

భరతా! వేగిరఁబడకుము. ఈబాలురవధ్యులుగాన శాంతభాషణంబు లతో సాధించుట యోగ్యకరము. (కుశలవులఁజూచి) బాలు లారా!

ఉ. ఎవ్వరు తల్లిదండ్రులు? వసించుట యేడ? మఖాశ్వబంధనం
బెవ్వరుసెప్పినారు? తగునే యిటువంటి యకృత్యధీరతల్ ?
చివ్వకు నిల్వఁగాఁగలరె । చిన్నవయస్కులు ? మాహితంబులన్
నవ్వులుగాఁ దలంపక మనంబున యోజనసేయుఁ డింతయున్.

లవు—ఈవిషయంబున మీరు మమ్ముల నంతగా బ్రతిమాలుట తగ దు. విశ్వలోకమహనీయవీరకులోద్భవులమైన మాకును మీ పాటి పౌరుషంబులు లేకఁ బోలేదు. పరివారశూన్యులమై—

పరాపజయతరుణప్రాప్తులమై మీవారిచేతులందుఁ జిక్కిన ప్పుడు సైతము మేము స్వప్రాణరక్షణంబు మిమ్ముల నాశించి యుండలేదు. సంధివాక్యంబులు వాంఛించి యెఱుఁగము. మీరు విచ్చేసిన కార్యమేమి ? మాతల్లిదండ్రుల కథనంబులు ను మా నివాసవిచారణంబులతోడను పనియేమికలదు ? పౌరుషరూపులకు సాహసకార్యసంఘటనంబు లెఱింగించువార లుండరుకదా! పిన్నవయస్కులమేగాని పరులబోధలు మా కహితంబులు. ఇన్నియేల? పరాక్రమవంతులగుదు రేని మమ్ము ల జయించి మీ యశ్వముఁ గొనిపొండు.

కుశ—ఇప్పు డింత యనవసర వాగ్వాద మేమిటికి ?

తే. గీ. తొలుత హయముఖంబున మహాబలులవోలె
బీరముల నేల యటువ్రాసినారు మీరు ?
వ్రాసినంతఁ బరీక్షింపవలయు మేము
రణమె సలుపుఁడు విక్రమ ప్రతిభఁజూపి.

భర—(కోపముతో) అగ్రజా ! ఇఁక సైచుట తగదు. బాలురని మనము కనికరించుచున్న కొలఁది వీరలు కఠినవృత్తులు మరల్పుకొనక యగౌరవాలాపములను సాగించుచున్నారలు. తగిన శిక్షలొనంగినగాని వీరల బింకంబు లడంగవు. ఉపేక్షింపకుము.

రాము—తమ్ముఁడా ! అంతగాఁ ద్వరఁబడుట తగదు. ఇప్పుడు మించి పోయిన దేమున్నది? సామోపాయము ప్రయోజనకారి కాని యెడల వీరలు దండనార్హులగుట తప్పదుకదా ? మంచిమాటలతోడనే యింకఁ బ్రయత్నించుదము. (కుశలవులఁజూచి) బాలకులారా ! మీ ముఖలక్షణంబు లుపలక్షించుచున్న మాహృదయములు దయారసమయములగుచున్నవి. మీయెడ

నట్టి యుగ్రకార్య మొనరించుటకు మాకుఁ జేతులు రాకున్న
వి. ఏల మామాటలఁ బాటింపక మొండితనంబునకు వత్తురు?

చ. వలసిన వేత్ర యశ్వములో? । వారణపంక్తులో? భూషణంబులో?
వెలఁగలరత్నసంతతులో? । విత్తములో? సుతిభూములో? క్షితీ
వలయములోన కోరినది । ప్రాణములైనను నిచ్చువాఁడ, నా
పలుకులఁ బాటిసేసి క్రతు । వాజి నొసంగుఁడు శ్రేయమయ్యెడున్.

కాదంటిరేని మీతో మాకు యుద్ధమే తప్పదు. అయ్యది లోకపరిహాసాస్పదమైయున్నది.

కుశ—ఏమీ! ఎంతటిమాటబల్కితివి?

తే. గీ. ధారుణీవిభుఁడవు నింక । దాత వగుట
యశ్వములు దంతులు ధనంబు । లాదిసేవా ?
కోరినవియిచ్చి పురికి నే । తేరఁగలవు
లేదు మాలోనఁ జెయిసాపు । వాఁ డెవండు.

యుద్ధమే శరణ్యముకాని యిరుపక్షంబులకుఁ దదితరమార్గము లేదు.

లవు—మాబోంట్లకు మీతో సంధియైన లోకపరిహాసకరమైనదే!

తే. గీ. వాజిముఖమున । గట్టిన వ్రాఁతఁగూర్చి
జఱుఁగనున్నది యిపుడె భీ । షణరణంబు,
సంధికై యత్నమూనెడు । జడుఁ డెవండు?
క్షాత్రజుల కిట్టి కుటిలమా । ర్గములు తగునె ?

భర—రాఘవేంద్రా! చెడిపోవనున్నకాలమున వీరలకు మనసీతివాక్యములు రుచియించునా? మీక్రోధనిరీక్షణంబులకు వీరలెంతటివారలు? పరశురామునికన్న పరాక్రమవంతులా? వాలికంటె బలశాలులా? పంక్తికంధరాది దనుజగ్రామణులమించిన ధీరులా? ఈపాపలనుగూర్చి యేమిఁటికిగాను మీరింక నంతగా శంకింతురు?

రాము—భరతా! శుభాశుభంబులెఱుంగని కూనలని యనుకంపయే గాని యూహావంబుఁ జేయుటకు వీర లెంతటివారలు. "చిన్నతనంబుచే సవనహయంబును గట్టిరిగాక, పరివారంబులతో నేగి పసిబాలుర సంహరింప, ప్రజాపరిపాలకుఁడే, రామునకు చేతు లెట్లాడె? ఏమిధర్మము?" అని మనలనే యిప్పుడు లోకంబులైనఁ బలుకకఁబోవు. మనచేతులలో నంత మొందిన తొల్లిటివీరులతోఁ బోల్ప వీర లేపాటి శక్తిమంతులు?

లవు—ఓహో! చిన్ననాటి రామాయణ కథనంతయు మఱల జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచుంటిరా!

సీ. జనకుఁడై యవసాన । సమయంబుఁ గాంచిన
పరశురాముని భంగ । పఱచు టగునో?
తరువుచాటున డాగి । ధర్మహీనత మర్క
టేంద్రుని యని సంహ । రించు టగునో?
కినిసి కుంభజుఁడు పు । క్కిటఁ గ్రోలి విడచిన
నీరధిని మును బ । ధించు టగునో?
కోఁతిమూకలఁ జేర్చు । కొని శాపవశుఁడైన
రావణాసురుని మ । ర్దనమె యగునో?

తే. గీ. ఏమిగాంచి మీ రిట । కేగినారు?
బాలురమె మేము మీపాలి । కాలురమును
శూరులరైన మమ్ములఁ । బోరుగెలిచి
సవనవాజినిఁ గొంపోవఁ । జనదె మీకు?

కుశు—ధీరులారా! జగదేకవీరకులంబునందుఁ గదా జనియించితిరి! మహాపరాక్రమశాలుర కుత్తమలక్షణంబు లిట్టివేనా? భువనవిజయు లేకదా! మీవారల పాల్లైనవి? అఖిలపరివారంబు లంతరించి యవిజయప్రాప్తి చేకూరినను మీపరుసబాసలు

మీపటాటోపంబు లంతరించలేదుకదా ! సంగరంబున కిచ్చ గించినసరియే ! అదికానిపక్షమున మాశరణ్యనైన వేడుకొనిన మీయెడఁ గృపఁబూనుదుము గాని మీకుటిలమార్గంబులకు వశఁబడము. ఏయుపాయంబుచేతనైన నేమి మమ్ములసాధింప మీకు దుర్ఘటకార్యమైయున్నది. ఏల యీలీల వృథావాక్యములతోఁ గాలయాపనఁ జేసి కార్యభంగముఁ గూర్చుకొందురు! ఏదియో యొందు దృఢబలిమికొనుఁడు.

రాము—పాపలారా!

ఉ. బాలకులౌట మీయెడఁ గృపాపరిపూర్ణుఁడనైన, నాదు వా
క్యాలను సమ్మతింపక సగౌరవభాషలఁ బల్కుచుండి, రే
లీలసహింతు మింక? పని లేదు మహారణమొండెగాక! యీ
కాలుఁడు కాచినాఁడు మిము కర్మఫలంబులు తప్పనేర్తురే?

(భరతునిఁజూచి) తమ్ముఁడా! వీరలయెడ దండనోపాయమే యోగ్యమైనది. ఇంక జాగుసేయవలదు.

భర—అగ్రజా ! క్షమింపఁజాలని ఘోరాపరాధములఁ గావించిన యీడింభకులఁ గనికరించుట మనకుఁదగదు. పరివారములఁ బురికొల్పి నే నీకుశునితో యుద్ధ మొనర్చెదను. మీ రాలవుని సాధింపుఁడు.

రాము—అటులనే కానిమ్ము !

కుశు—లవా! త్వరపడవలదు. భద్రము సుమా!

లవు—అన్నా! భయములేదు.

భర—(సేనలఁజూచి) సైనికులారా! రండు. క్రమ్ముకొనుఁడు. (కుశునిఁజూచి) ఓరీ! వాచాటా! వృథామాటలతో నేమిటికి? రమ్ము. నాయీ తీక్ష్ణబాణపరంపరలఁ గాచుకొనుము.

(అని బాణము విడచును.)

కుశు—వీరమాతృసుతులము. ప్రథమమునుండియు మేము మీతో నభిలషించినది యాహవమే గాని యన్యముగాదు. అప్రయోజనములైన భామలతో నింతకాలము వెళ్ళించితిరిగాని, యీ యత్నము ప్రప్రథమముననే గావించిన మిమ్ముల నీపాటికిఁ గృతాంతపురంబునకుఁ బంపియుండెడివారమే! ఇప్పుడైననేమి? మీబాణములు మాకు కంఠహారంబులు. మాప్రయోగంబులు మీకు ప్రాణసంకటంబులు.

(అని మఱల బాణమువిడుచును.)

రాము—(తనలో) ఏలనో కాని చేతులాడవు? ప్రియురాలైన వైదేహియుత్తమకళలే యీబాలకులందు ప్రతిబింబములుగా నున్నవి. ఏమందును?—ఏమియైనఁగానిమ్ము. యుద్ధము నిశ్చయించితిమి కదా! (లవునిఁజూచి ప్రకాశముగా) మునికుమారా! మీశ్రేయములు కోరి వచియించిన మాహితవాక్యములు మీ కనమ్మతములాయెనుకదా! ఇఁక భద్రవృత్తి వహింపుఁడు. నానా లోకజాలవిభీకరంబను నీనారాయణాస్త్రప్రయోగంబుచేతనే నీగర్వమడగింతును.

(అని నారాయణాస్త్రము బ్రయోగించును.)

లవు—భయము లేదు. భయము లేదు. లోకైకవీరజననితనయుఁడనైన నేను నీదివ్యాస్త్రము నిప్పుడు పుష్పమాలికవలె ధరింతును. చూడుము.

తే. గీ. పావనచరిత్ర మాతల్లి । భవ్యరాలు
పతికిహితముగా వసుధపైఁ । బరఁగెనేని,
గురులయానతప్పనిబాల । కులమె యేని,
పూలమాలలు మాకు శస్త్రాలు మీవి.

(అనిన నారాయణాస్త్రము లవునికంఠమున పుష్పమాలయగును.)

భర—శ్రీరామచంద్రా! మనయస్త్రజాలంబులు వీరలమెడ వ్యర్థములైన వేల? నాశ్రయోగమైన నీవిధంబుగనే కుశునకుఁగంఠహారమై పరిణమించినది.

రాము—భరతా! ఆశ్చర్యముగానున్నది. ఉత్తమచిహ్నంబులతో విరాజిల్లువీరలు సీతాసుతులగుదురా?

(వాల్మీకి ప్రవేశించి.)

రఘుకులతిలకా! సత్యము. సత్యము. నీబిడ్డలకుఁగాక యొరులకింతటి పరాక్రమసాహసంబులు, ప్రశంసనీయరూపతేజోవిశేషంబులు నుండునే?

రాము—(నమస్కరించి) మీదర్శనము మా కపూర్వానందసంధాయకమైనది.

భర—(నమస్కరించి) మునీంద్రా! వందనము. రఘుకులాంకురము లేయందురా యీబిడ్డలు!

కుశ-లవు—తాతగారూ! నమస్కృతులు. మీయనుజ్ఞ లేనిదే మెుఁగకఁ గావించిన మా యీ యపరాధమునుక్షమియింపుఁడు.

(అని యిరువురు నమస్కరింతురు.)

వాల్మీ—శ్రీరామచంద్రా! లోకనిందచే మీయాజ్ఞానుసారముగా గంగాభూములకుఁ బంపఁబడిన జానకీదేవి నాయాశ్రమమందే కాలముఁగడుపుచు నీ కుశలవులఁగాంచినది. ఇంతకాలంబునుండి యీబాలుర కన్నివిద్యలు నేనే సాంగముగాఁ గఱపితిని. సమస్తవిషయంబులందును వీరలకు వీరలే పోలుదురు. (కుశలవులఁ జూచి) బాలులారా! యీపాకృతపూరుషుఁడే మన రామాయణకథామూలకుండగు శ్రీరామభద్రుఁడు. మిమ్ములఁగన్నతండ్రి. (అని రామునిఁజూపును.) ఈతఁడే కైకేయిపుత్రుఁడైన మీపినతండ్రిభరతుఁడు. (అని భరతునిఁజూపును.)

కుశ-లవు—(భక్తివినయములతో) తండ్రులారా! మిమ్ములనెఱుంగక మీయెడ ఘోరాపచారముం గావించినారము. బిడ్డలతప్పిదములఁ దండ్రులే సైచి మన్నింపవలయును గాన మమ్ము భరియింపుఁడు. మా నమస్కృతు లందుఁడు.

(అని నమస్కరింతురు.)

రామ-భర—బిడ్డలారా! ఎఱుంగకఁ జేసినవి దోసములు కానేరవు. విధికృతమంతయు నీవిధముగనున్నది. మీరుకదా యీపవిత్ర రఘుకులవంశోద్ధారకులు. మీయుత్కృష్టజననములచే మేముకూడ తరించితిమి రండు.

(అని కౌఁగిలించుకొందురు.)

కుశ—గురూత్తమా! సంగ్రామంబున గతించిన మా పినతండ్రుల లక్ష్మణశత్రుఘ్నులఁ బునర్జీవితులఁ జేయ మీరే దివ్యప్రభావులరుగాన నవశ్యము మా కామహాద్భాగ్యముఁ జేకూర్పుఁడు.

లవు—తాతగారూ! మామూలమున నీయుద్ధమున గతించినదంతయు నెప్పటికట్లుఁ గావింపుఁడు.

వాల్మీ—వత్సలారా! అంతయు మీయభీష్టానుమతముగనే యగుఁగాక! అదుగో! వారే లక్ష్మణశత్రుఘ్నులు పునర్జీవితులైరి.

(లక్ష్మణ, శత్రుఘ్నులు ప్రవేశింతురు.)

మునీంద్రా! వందనములు (అని వాల్మీకునకు నమస్కరించి) అగ్రజా నమస్కృతులు. (అని రామునకు నమస్కరింతురు.)

వాల్మీ—పుణ్యులారా! మీసీతారామలబిడ్డలే యీకుశలవులు!

లక్ష్మ-శత్రు—మునీశ్వరా! ఎట్టి సుభగవృత్తాంతమును వింటిమి!

కుశ-లవు—తండ్రులారా! మామహాపచారములను సైపుఁడు.

(అని నమస్కరింతురు.)

లక్ష్మ-శత్రు—బిడ్డలారా! మీజన్మములు యోగ్యములైనవి. మీరు మహాదృష్టజాతకులు.

(అని కౌగిలించుకొందురు.)

వాల్మీ—శ్రీరామచంద్రా!

ఉ. భాసురపూర్ణగర్భవతిఁ బాసితి వార్త్వక లోకనింద, సీ
తాసతి ముగ్ధరాలు, వసుధ స్తవనీయచరిత్ర, సుతయున్
దోసముఁ జూడ మాపెయెడఁ బ్రొద్దెను కాలము నీకుసేవతో
రాన మెలర్పఁ జేకొని పరస్పరసౌఖ్యములం జెలంగరే!

లక్ష్మ-భర-శత్రు—అగ్రజా! మన జన్మలకుఁ బూర్వమే యెన్నఁడో శ్రీమద్రామాయణమహాకావ్యము నిర్మించిన యీపాత్రిచేత సులవారివాక్యములు సత్యములైనవి. జానకీదేవి సుధరు రాలు. ఆసాధ్వీమూలముననే మన రఘువంశము పవిత్రవంతమై ఒల్చినది. ఇంకనైన సందేహము విడచి యీపుణ్యరాలను వేగమే మీరు స్వీకరించుట యుత్తమమార్గము.

కుశ-లవు—తండ్రిగారూ! మాతల్లివంటి పతివ్రతాతిలకము, ప్రశ స్తవీరురాలు నీజగంబుల లేరనియే మేము గర్వించుచుంటిమి. మాజీవితవిజయంబులకు మాతల్లి, సీతామహాదేవిపాతివ్ర త్యబలమే ముఖ్యహేతువు. అవశ్యము మాజననితో మమ్ముల గ్రహియింపుఁడు.

(నేపథ్యమున)

రఘుకులగ్రామణీ! అతిపుణ్యరాలైన సీతనుఁగూర్చి సంశ యంబువలదు. శీఘ్రమే బిడ్డలతో నాయమను గ్రహించి పాలింపుము.

రాము—(సంతోషముతో) ఓహో! వాల్మీకి మునీంద్రా! లోకంబు లన్నియు కళంకరాహిత్యమైనసీతాచారిత్రంబునకు సాక్షుల

సాక్షీభూతంబులైనవి కదా! ఇతయు మీా కృపావిశేష ముగాని యన్యముకాదు. లక్ష్మణుని బంపి జానకీదేవిని రప్పింపుడు.

వాల్మీ—(లక్ష్మణునిఁజూచి) సౌమిత్రీ! శ్రీసీతారాములపునస్సంయోగకార్యమునకైన నీవే ప్రధానుఁడవు. వేగమే నా యాశ్రమంబున కరిగి జానకిని నాయాజ్ఞగా నిటకుఁ గొనిరమ్ము.

లక్ష్మ—మహాత్మా! మంచిది.

(అని నిష్క్రమించును.)

భర-శత్రు—అదుగో! సమయమునకే పురోహితులైన వశిష్ఠుల వారు కూడ విచ్చేయుచుండిరి.

రాము—మంచిది. మునీంద్రా! కాలము యోగ్యమైనచో నక్రియత్నంబుగనే శుభసంతతులు వాటిల్లునుకదా?

వాల్మీ—అగునగు!

[వశిష్ఠుఁడు ప్రవేశించి]

శ్రీరామచంద్రా! జానకి యోగ్యురాలు. ఆసాధ్వీజీవిత మంతయు కడగండ్లతోఁ గూడినను నాపెకు నీయందుఁగల ప్రణయభావంబులు, భక్తిసంపదలు శ్లాఘనీయములు. వీరమాతయై, విస్తృతకీర్తిశోభితయై సత్పుత్రులఁబడసి మీాపావనభాస్కరకులంబునకు వన్నెయేగూర్చినది. ఆచంద్రార్కప్రకాశంబుగా శ్రీమద్రామాయణ మహాకావ్యరచయితుండైన యీా వాల్మీకిమునీంద్రుఁడే మీాకిప్పుడు ప్రబలసాక్షీభూతుఁడు. సంశయింపక సత్పుత్రవంతురాలైన యీా వైదేహి నింక గ్రహింపుము.

రాము—గురూత్తమా ! అట్లనే యొనరింతును.

[సీత—లక్ష్మణుఁడు ప్రవేశింతురు.]

సీత—నాథా ! నమస్కృతులు. (అని నమస్కరించి) మునిచంద్రులారా ! అభివందనములు. (అని వాల్మీకి, వశిష్ఠులకు నమస్కరించును.]

వాల్మి-వశి—అమ్మా ! జానకీ ! శుభంబు లగుఁ గాక !

రాము—దేవీ ! పవిత్రమహీనందనీ !

మ. జగముల్ బల్కనసిందకై, మనములో । సైపంగలే కెంతయున్
సుగుణవ్రాతవునిన్ను, నిర్దయుఁడనై । చూలాలవైయుండగా,
మృగసంతాననివాసభూములను వ । ర్తింపంగఁ బంపించితిన్
నిగమోక్తంబనిగాని, నీచరిత సం । దేహింతునే జానకీ !

(కుశలవులఁ జూచి) కుమారులారా ! మీజననములచే మీతల్లికష్టము లు కడతేరినవి. రండు.

(అని కౌఁగిలించుకొనును.)

సీత—(సంతోషముతో) నాథా ! నేఁటికిఁకదా ధన్యురాలనైతిని.

లక్ష్మ-భరత-శత్రు—అగ్రజా ! ఈకుశలవుల కిప్పుడే కులగురువైన వశిష్ఠులవారిసముఖమునను, మనవంశరక్షకులైన యీవాల్మీకులవారిసముఖమునను పట్టాభిషేకముఁ గావించుట మిగుల శ్రేయమైనది.

సీత—నాథా ! పెద్దకాలంబునకు, మీతల్లిదండ్రుల కంతటి మహాభాగ్యము లేకఁబోయినను, మనకైన లభించినది. ఈతనయులఁ బట్టాభిషిక్తులఁ జేయుఁడు.

వాల్మీ-వశి — శ్రీ రఘుకులశేఖరా! యుక్తవయస్కులగు నీకుశ
లవులు పట్టాభిషేకంబున కర్హులగాన నట్లు గావింపుము.

రాము — అదియే శుభమైనది. ఇంక నేమికావలయును?

— భరతవాక్యము —

గీ. వసుధ కుటిలవృత్తులు లేక వరలుఁగాక!
క్షామము లడంగి యఖిలరాజ్యములు వీడి
బాధలందక శోభతఁ బరఁగుఁగాక!
అతులధర్మమార్గము జయంబందుఁగాక!

(అని యందఱు నిష్క్రమింతురు.)

[ తెఱపడును. ]

